


**Swatantra Films Ltd. Madras 17**

వా-సీడెడ్: ప్రీమియర్ ఫిలింస్ లిమిటెడ్ గవర్నరుపేట . బెజవాడ.

ార్-కర్లు: రాఘవేంద్ర పిక్చర్సు గాంధీనగర్ - బెంగుళూరు.

ucers: **SWATANTRA FILMS Ltd**, T. Nagar, MADRAS

# అభ్యుదయ

సచిత్ర సాహిత్య మాసపత్రిక

సం. ౧, సంచిక ౧౧ సెప్టెంబరు, 1947




ముఖచిత్రం : శ్రీ ముద్దుకృష్ణగారు


సంపాదక వర్గం :

చదలవాడ పిచ్చయ్య

కొమఱ్ఱాజు వినాయకరావు ప్రయాగ కోదండరామశాస్త్రి

# మహోదయం

:: శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి ::

ఏమహాత్ము చేయి ఈ రేయి చెరసాల
తలుపు లూడ లాగె తెలియకుండ !
పారలి ముంచు క్రొత్తప్రొద్దు గాలుల తోడ
చనవు లేక యూర్పు సాగదేమొ !

అవురా, సఖుండ నమ్మవుకాని చిరనిద్ర, మాని యొత్తిలి మాడుమా, ల్వాదీయ
గేహాజిరమున క్రిక్కిరిసెను వెల్గులు - రేయి యంచుల పొర్లి పోయినట్లు
ఏనాటి కేనాటి కిది, మహోదయము, తప్పదు, వలచ్ఛక్ర చాపమ్ము వోలె
మువ్వన్నియ పతాక మూగాడు క్రొత్త రా - దరికపు బిగువుతో వదలు నిండి
లెమ్మ, నెచ్చెలికాడ, నిజమ్ము, లేచి - కనుము నీ వొక్క-పరి, నాల్గు కడల పొడిచి
తరలి పైబడు ముక్త చైతన్యధార! ఎత్తు, తల, పైకి! హిమగిరి శృంగమట్లు—

కొన్ని నూరేండ్లు బానిసీ డన్న మాట
గుండె లోలోన దొలిచిన కుళ్ళి యేడ్పు
మిప్పటికి గూడ, కైలైన నెత్తకుండ
ఎట్టు లుంటిమొ, చిరుజాతు లెగసి పడగ?—

గదులై, అరలై చెడినది కలకాలపు మన లోగిట
కదిసిన ప్రతీచి ప్రాచియు కరగిపోయె నొక కౌగిట
సరిహద్దులు చెరుప గలుగు కరుణ జగత్కుటుంబమున
పరపీడన ముండనీదు; పచ్చినెత్రు త్రావ నీదు !

జరర శిథిల జగతీ మందిరముల పడగొట్టు !
తరుణ మంగళ స్వర్గము ధాత్రీతలమున గట్టు !
భావికాల ముఖశాలల బ్రతుకులు పరపించి
ప్రతి మానవు శిరమున నుజ్వల మకుటము పెట్టు!

[ ఎ. ఐ. ఆర్. వారికి కృతజ్ఞతతో.

# కళాజీవి ముద్దుకృష్ణ



"ఏ కవి రచనలలో నయినా సరే, తన సంఘ పరిస్థితులు, తన కాలానికి చెందిన వాతావరణము ప్రతిబింబితము కాకమానవు. అంతే కాదు, నిజమైన కవి వీటిని రద్దు చేసుకొని జీవించడు. తన జీవితానికీ, తన సంఘానికీ, తన దేశానికీ, తాను జీవించిన కాలానికీ సన్నిహితంకాని కృతికి విలువ లేదు." అన్న ఉత్తమ దృక్పథంతో ఆంధ్ర సాహిత్యరంగంలో కొత్త పోకడలకు దారి తీసిన వారిలో శ్రీ ముద్దుకృష్ణగారొకరు.

శ్రీ ముద్దుకృష్ణగారు 1899 ఫిబ్రవరి 7 వ తేదీన జన్మించారు. చిన్నతనంలో, మూడవ ఫారం చదువుతున్న రోజుల్లోనే, ఆయనకు తెలుగులో ఏదో ఇష్టమున్నట్లు కనుక్కున్న తండ్రిగారు మను చరిత్ర వసుచరిత్ర పాఠం చెప్పి, తెలుగు సాహిత్యంలో అభిరుచి కలిగించారు. ఈ సాహిత్యాభిరుచే ఆంగ్ల సాహిత్యానికి కూడా ప్రాకి, స్కూల్ ఫైనల్ చదివే నాటికే, 'మర్చెంట్ ఆఫ్ వెనిస్' నాటకంలో అభినయింప జేసింది.

ముత్తాత శ్రీ ముద్దు నరసింహం గారు 1840 లోనే వితంతు వివాహం మొదలైన సంఘ సంస్కరణలను ప్రతిపాదిస్తూ, ప్రజలందరికీ తన రచన అందుబాటులో వుండాలని, వ్యావహారికాంధ్రంలో 'హితసూచని' అనే గ్రంథం వ్రాసారు. తండ్రిగారు సంఘ సంస్కరణోద్యమంలో శ్రీ వీరేశలింగంగారిఅనుయాయులుగా పని చేసారు. కుటుంబంలోని ఈ వాతావరణ ప్రభావం ముద్దుకృష్ణగారి మీద పడింది.

కాలేజీ చదువు కాకినాడలో శ్రీరఘుపతి వెంకటరత్నంనాయుడు గారి వద్దనే చదవాలనిపించింది. కాని అది ఎంతో కాలం సాగలేదు. నాయుడుగారు కాలేజీకి సెలవు పెట్టడంతో, తాను రాజమండ్రి కాలేజీకి చేరవలసివచ్చింది. మహా

పండితుడైన శ్రీ నాయుడుగారి వద్ద చదువుకునే అదృష్టం లేకపోతే మానెగాని, ఇక్కడ సంస్కృతం చదువుకునే అవకాశం చిక్కింది. శూద్రుడికి సంస్కృత మేమిటని ధర్డ్ఘారంలో సంస్కృత పండితుడు కొట్టిన దెబ్బనుంచి, ఎలాగయితేనేం, తేరుకోడం కూడా జరిగింది. కళాశాలా పట్టభద్రతతో పాటు, సంస్కృతాంగ్ల సాహిత్య పరిజ్ఞానంకూడా ముద్దుకృష్ణ గారికి రాజమండ్రిలోనే లభించింది. ఆనాడు దేశమంతటా నూతనోత్తేజం రేకెత్తించిన 1920 జాతీయోద్యమ ప్రభావం ఆయనలో స్వాతంత్ర్యాభిలాషను పురికొల్పింది.

ఒక వైపున సంఘసంస్కరణ భావాలు, మరో వైపున స్వాతంత్ర్యాభిలాష. ఆయన ఆలోచనా పథంలో తెచ్చిన సంచలనంతో రచన ప్రారంభమైంది. అటు కాలేజీలో వ్రాత పత్రికనడపడం, ఇటు కృష్ణ శాస్త్రి, దీక్షితులు, శివశంకరశాస్త్రి, వేదుల మొదలైన వారితోను, హరీంద్రనాథ ఛటోపాధ్యాయతోను సన్నిహిత సంబంధాలు-ఆయన కళాతృష్ణను దోహదం చేసాయి. కళాశాలలో ఇంగ్లీషు నాటకాలు, ఉళ్ళోృ కేసరి సమాజంవారి తెలుగు నాటకాలూ ఆయ్యనకళాభిరుచికి అనుభవం సమకూర్చి పెట్టాయి.

తర్వాత మద్రాసు లాకాలేజీలో చదివేరోజుల్లో రాఘవాచారిగారి పరిచయం నాట్యకళలోను, ట్రివేండ్రంలో బి. యల్. చదివేరోజుల్లో మళయాళీ సాహిత్యంతోను, మహాకవి వల్లథోల్‌తోనుకలిగిన పరిచయం సాహిత్యంలోను నూతనోత్సాహాన్నిచ్చాయి.

ఆదర్శాలయితే గొప్పవే కాని, జీవితం వంక చూస్తే అంతా అయోమయం. రేపటినుంచీ ప్లీడరీ బోర్డు కట్టుకొని, తప్పుడు సాక్ష్యాలకు తరిఫీను ఇవ్వాలిసిన మనిషి, తాను, ఈ ఆదర్శాలను సాధించేదెక్కడ ? అయినా, ఈ ఉద్యోగాలన్నీ సంపాదన కోసమే గదా ? సంసారం లేకపోతే, సంపాదనతో పనేముంది ? ఎలాగో, తనవరకు తాను జీవించ వచ్చుకదా ! ఈ ఆలోచనలతో, ఆనాటి సాంఘిక

దురాచారాల మధ్య సాంసారిక జీవితమంటే తిరస్కారభావం కలిగి, సంఘాన్ని సంస్కరించాలన్న ఒకే ఆదర్శ వాదంతో, ఏమైనాసరే పెళ్ళి చేసుకో గూడదని ఆయన ప్రతిజ్ఞతీసు కున్నారు.

అంతటితో, ఇన్నాళ్ళ బట్టీ తన చుట్టూగోడలు కట్టి తనను బంధించి నట్లున్న సంఘం,హఠాత్తుగా మటు మాయమై, తన కేదో కొత్తవిము క్తి వచ్చేసి నట్లనిపించింది. 1927 లో హరీంద్రనాథ ఛటోపాధ్యాయతో కలిసి, అనేక కళాప్రదర్శనాలు చేస్తూ, ఆంధ్రదేశమంతటా పర్య టన చేసారు. 1932 జాతీయోద్య మంలో పాల్గొన్నారు. తర్వాత మళ్లీ 'హరీన్' తో ఆంధ్ర దేశ సంచారం.

ఈ కాలంలోనే, ముద్దుకృష్ణ గారు గ్రంథరచనమీద కేంద్రీక రించారు. పాశ్చాత్య సంస్కృతీ నాగరికతా ప్రభావాలతో, ఆర్ష సంస్కృతీ నాగరికతల పేరిటవున్న మూఢవిశ్వాసాలమీద విముఖత కలిగించే 'అ శో క ం' నాటకం వ్రాసారు. పురాతన సంప్రదాయా లనే సంకెళ్ళను త్రెంచుకొని, కొత్తజీవంతో అప్పటికే మొాసు లెత్తుతున్న నవకవుల పద్యగేయ రచనలు సేకరించి, 'వైతాళికులు' అనే క వి తా సంపుటిని ప్రక టించారు. ఇది, సాహిత్యమంటే ప్రజల్లో అభిరుచిని పెంపొందించ డానికీ, నూతన కవితారీతులనూ, యువకవులనూ ప్రోత్సహించ డానికీ ఎంతైనా తోడ్పడింది.

అప్పటికే రష్యా యూరప్ అమెరికా దేశాల్లోని నాట్యకళాభి వృద్ధిని పరిశీలించి వ చ్చారు హరీంద్రనాథ ఛటోపాధ్యాయ గారు. ఆయనతో కలిసి, ఢిల్లీ పట్నంలో వుంటూ, ముద్దుకృష్ణ గారు ఆయా శిల్పవిశిష్టతలను అవ గాహన చేసుకొన్నారు. ఇద్దరూ కలిసి, 'హరీన్' వ్రాసిన 'చిలుక', 'విదేశాలనుంచి తిరిగివచ్చి' అనే నాటకాలను సరికొత్త శిల్పంతో ప్రదర్శించారు.

తర్వాత 1933 నుంచీ 'జ్వాల' పత్రికా ప్రచురణ. ఏవిధినో అదృ ష్టానో వెతుక్కుంటూ మూఢ విశ్వాసాలతో ఉన్న సమాజాన్ని ఒక్కసారిగా ఊపివేసి, యువ కుల్లో స్వతంత్రమైన ఆలోచనా

శ క్తికి దోహదంచేసిన తెలుగు పత్రికల్లో 'జ్వాల' ఒకటి. కాని, అదీ ఆట్టేకాలం సాగలేదు.

మళ్ళీ, ముద్దుకృష్ణగారు తన నాటక ప్రదర్శనానుభవాన్ని పెంపొందించుకోవాలనే జిజ్ఞాసతో, 1935 నుంచీ 1939 దాకా, సినిమారంగంలో పనిచేసారు. 'టీ కప్పులో తుపాను', 'భీమా విలాపంలో భామాకలాపం' అనే నాటికలు వ్రాసి, 1939 లో దాదాపు ఇరవై కేంద్రాల్లో ప్రదర్శించారు ఒకటి రెండు చోట్ల ఆయనకూడా పాత్రధారణ చేసారు. 1939 అనంతరం ఆయన అనేక నాటకాలూ, ఏకాంకికలూ, కథలూ వ్రాసారు కాని, కాగితం కరువు వాటిని మన కంట బడనీయడం లేదు.

ఆయన రచనలన్నీ పురాతన సమాజంమీద ఎంత అసంతృప్తిని వెల్లడిస్తూ వుంటాయో, నూతన సమాజంమీద అంత ఆశతోను, విశ్వాసంతోను ముందుకు చూస్తూ వుంటాయి. ఇబ్సన్ దృష్టి వైశాల్యమూ, పాత్రచిత్రణా, ఆస్కార్ వైల్డ్ సంభాషణా చాతుర్యమూ, బెర్నార్డుషా నాటక శిల్పమూ ఆయన కాదర్శాలు. వీటిని దృష్టిలో పెట్టుకొనే ఆయన తన నాటక రచన సాగించారు. కాని, ఆచరణలో, ఈ మహత్తర శక్తులను ఆయన నాటకాలే ఋజువు చేసుకోవాలి.

మొదటి నుంచీ, సమాజాభ్యుదయాన్నే వాంఛిస్తూ, ప్రతి అభ్యుదయోద్యమానికీ తన సాహిత్య కృషిద్వారా తోడ్పడుతున్న అభ్యుదయ రచయిత ముద్దుకృష్ణ; నాటక రచనలోను, ప్రదర్శనాశిల్పంలోను నిరంతరం కృషి చేస్తున్న కళాజీవి ముద్దుకృష్ణ.

— ప్రయాగ

## సంపాదకీయం

# నిషేధాలూ నిరోధాలూ తొలగించాలి!

మన స్వాతంత్ర్యంకోసం, మన సంస్కృతికోసం, మన సాహితీ కళాభ్యుదయాలకోసం ఎన్నో త్యాగాలుచేసి, ఈనాటికి జాతీయ ప్రభుత్వాన్ని నిర్మించుకోగలిగాం. కాని, మన వాక్సభా పత్రికా, స్వాతంత్ర్యాలు ఇంకా అరికట్టబడుతూనే వున్నాయి; మన గ్రంథాలూ, ప్రదర్శనాలూ ఇంకా నిషేధించ బడుతూనే వున్నాయి. ఇది మన జాతీయ సంస్కృతీ కళా వికాసాల కోసం నిరంతరం కృషి చేసిన మన జాతీయ నాయకులే ప్రభుత్వంలో వుండగా జరగడం మరీ విచారకరం.

ఎప్పుడో అడ్వైజర్ల పరిపాలనలో 'ముందడుగు' నాటక ప్రదర్శనంమీద పెట్టిన నిషేధం ఇంకా అలానేవుంది. దీనికితోడు, మన మద్రాసు ప్రభుత్వం మళ్ళీ 'సిమ్లా భాగవతం' అనే ఏధినాటకాన్ని, 'సీతారామరాజు' అనే బుర్రకథనూ ప్రదర్శించకూడదని నిషేధించింది. ప్రజాశక్తి నుంచి రు. 2000/-లు ధరావతు కోరింది.

ఈనిషేధాలకూ, నిరోధాలకూ ప్రభుత్వం ఏమి జవాబు చెప్పుకున్నప్పటికీ, అవి ప్రజాస్వామిక చర్య అని ఎవ్వరూ అంగీకరించరు. ప్రజాస్వామ్యాలకోసం, పౌరస్వత్వాలకోసం నిన్నటిదాకా ఆందోళన చేసిన మన జాతీయ నాయకులు, ఇవాళ తమ ఆందోళననే తాము గుర్తుంచుకోవాలి. ఇతరుల వాక్సభా పత్రికా స్వాతంత్ర్యాలనూ, పౌరస్వత్వాలనూ అరికట్టడమంటే అసత్యాన్ని అన్యాయాన్ని అణచడమని ప్రభుత్వం చెప్పినా, నిజానికి అది సత్యానికీ న్యాయానికీ జంకడమే అవుతుంది.

ప్రజాస్వామికమంటే, ఎవరైనా తమఅభిప్రాయాన్ని బహిరంగంగా ప్రకటించుకొనేహక్కు వుండాలి; ప్రచారం చేసుకునే హక్కువుండాలి. అది తప్పో ఒప్పో నిర్ణయించవలసింది ప్రజలు. తప్పును

నిరాకరించడమూ, ఒప్పును స్వీక రించడమూ ప్రజలు ఇవాళ క్రొత్తగా నేర్చుకోవలసిన పని లేదు. అరవై సంవత్సరాల మహత్తర జాతీయ స్వాతంత్ర్యోద్యమం మన ప్రజానీకంలో ఉత్తమ చైతన్యంగా మూర్తీభవించింది. ఏప్రజాస్వామిక ప్రభుత్వమైనా, చైతన్యవంతులైన ఆ ప్రజల నిర్ణయానికి ఎదురుచూడ వలసిందే కాని, లేని పోని నిషేధాలూ, నిరోధాలూ కల్పించకూడదు. ఏ ప్రజల విశ్వాసంతో ప్రభుత్వం అధికారంలోకి వచ్చిందో, ఆ ప్రజల ఆశలనూ, అభిలాషలనూ, కళాసంస్కృతులనూ ఎంతమాత్రం అరికట్ట కూడదు.

మద్రాసు ప్రభుత్వం ఈ సామాన్య ప్రజాస్వామిక సూత్రాన్ని గమనించి, పై నిషేధాలనూ నిరోధాలనూ వెంటనే ఉపసంహరించుకోవాలనీ ; ముఖ్యంగా మన స్వతంత్ర భారతంలో ప్రజల ప్రాథమికహక్కులకూ వాక్సభా పత్రికా స్వాతంత్ర్యాలకూ ప్రభుత్వమే పూచీపడాలనీ కోరుతున్నాం.

ప్రభుత్వం తన నిషేధాలనూ, నిరోధాలనూ ఉపసంహరించుకోనేదాకా, అభ్యుదయాభిలాషులూ, సాహితీపరులూ, కళాకారులూ, స్వాతంత్ర్యాభిమానులూ - అందరూ ఆందోళన చేయాలని ; ప్రభుత్వం ప్రజాస్వామిక ధోరణిలో నడవడానికి తోడ్పడాలనీ కోరుతున్నాం.

---

## విరాళం

4—9—47 ఉదయం 10 గంటలకు శ్రీయుత తుమ్మల వెంకట్రామయ్యగారి అధ్యక్షతను- ఆంధ్ర 'అభ్యుదయ రచయితల సంఘకార్యాలయంలో (బెజవాడ) శ్రీ ఉప్పల గోపాలరావు, శ్రీ గుమ్మడి సీతారామమ్మగార్ల వివాహం జరిగింది. ఈ దంపతులు వివాహసమయంలో 'అభ్యుదయ'కు రు116 లు విరాళం ఇచ్చారు. ఈ దంపతులకు మా హృదయపూర్వకాభివందనాలు.

— సంపాదకులు

# సాహిత్య మీమాంస

## 'మాభూమి' సమీక్షపై చర్చ

[ 'అభ్యుదయ'లో 'మా భూమి' నాటక సమీక్ష ప్రచురించాం. ఆ సమీక్ష మీద కొందరు, నొచ్చుకున్నట్లుగా, వ్యక్తిగత దూషణలతో సంపాదకవర్గ సభ్యునికి జాబులు వ్రాసారు. అదే ధోరణిలో సోదర పత్రిక 'నవయుగ'లో 'రావు' గారి వ్యాసం కూడా ప్రచురించబడింది. పాఠకుల సౌకర్యంకోసం, ఆ వ్యాసాన్ని పూర్తిగా ఈ క్రింద ముద్రిస్తున్నాం. దానితోపాటు, సమీక్షకుని అభిప్రాయం, ఇతర విమర్శలూ కూడా ప్రచురిస్తున్నాం.

సాహిత్యాభ్యుదయానికి విమర్శన తోడ్పడుతుందనీ, సాహిత్యాభ్యుదయాన్ని కోరేవారు తమ విమర్శనలు పంపి, ఈ చర్చలో పాల్గొని, సాహిత్య విమర్శనా జ్ఞానాన్ని పెంపొందించడానికి తోడ్పడాలని కోరుతున్నాం.

—సంపాదకులు ]

## ఘనత్రి

'అభ్యుదయ'లో మొదటినుంచీ అనేక గ్రంథాలను సమీక్ష చేసినట్లే, క్రిందటి సంచికలో 'మాభూమి' నాటకం సమీక్ష చేసాను. 'మాభూమి' నేటి తెలంగాణా ప్రజాజీవిత పోరాటాన్ని చిత్రించడానికని వ్రాయబడిన నాటకం కనుక, ఆదృష్టితోనే దాన్ని పరిశీలించడం జరిగింది. ఈ నాటకంద్వారా ఏ చైతన్యమైతే ప్రజలకు అందించవలసివుందో, దాన్ని ఇది అందించలేకపోయిందే అన్న బాధనూ ఆందోళననూ మాత్రమే, సహేతుకంగా, నా సమీక్ష వ్యక్తం చేసిందనుకొంటాను.

అయితే, అది కేవలం నిర్దుష్టంగానే వున్నట్లు అందరూ ఒప్పుకోవాలనిగానీ, ఏవైనా దోషాలు దొర్లినట్లయితే దిద్దుకోరాదనిగానీ నా అభిప్రాయం కాదు. మనకున్న అనుభవాన్ని బట్టీ జ్ఞానాన్ని బట్టీ మాత్రమే, మనం చెప్పేవిషయంలో నిజం వుంటుంది. ప్రతివ్యక్తికీ ప్రతివిషయమూ తెలియనట్లుగానే, నాకూ తెలియని విషయాలు అనేకంవుండి, నా రచనల్లో ఆ అజ్ఞానం ప్రతిబింబించ వచ్చు. ఈ వాస్తవానికి నేను అతీతుణ్ణని ఎప్పుడూ అనుకోడం లేదు. అందువల్లనే విమర్శలను హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాను.

ఇవి నా సమీక్షను సమర్థించుకోడం కోసం వ్రాసే మాటలు కావు. ఇంతవరకూ విమర్శకు లెవ్వరూ సమీక్షలో లోపాలు చూపనప్పుడు సమర్థించుకోవలసిన అవసరం కూడా లేదు. నిజంగా లోపాలు చూపితే,

దిద్దుకోవాలనే తప్ప, సమర్థించుకోవాలనే కోరికా లేదు.

కనుక, మన సాహిత్యంలో విమర్శా దృష్టిని పెంపొందించుకోడానికీ, అభ్యుదయ కళా పథాన్ని సుగమం చేసుకోడానికీ సోదర సాహితీపరుల సలహాను సహాయాన్ని అర్థిస్తున్నాను.

—ప్రయాగ కోదండరామశాస్త్రి
4—9—1947.

# 'నవయుగ'లో 'రావుగారి, 'విమర్శ'

[ పూర్తి పాఠం ]

"మాభూమి" నాటకాన్ని గురించి ఆంధ్రలో కానికి ఇప్పుడు కొత్తగా పరిచయం చేయవలసిన అవసరం ఏమీ లేదు. ఎందుకంటే— ఆంధ్ర ప్రజానాట్యమండలి వారి ప్రదర్శనల ద్వారా వేలకొలది ఆంధ్ర ప్రజానీకం ఆ నాటకాన్ని చూస్తున్నారు. అది వారిని ఉర్రూతలూగిస్తోంది. ప్రతి ప్రదర్శనానికి టిక్కెట్లు దొరకక నిరుత్సాహంతో తిరిగి పోయేవారనేకులున్నారు. ఈ నాటకం ప్రదర్శించడం ప్రారంభించి రెండు నెలలైనా కాకుండానే ఒక్క బెజవాడలోనే ఇప్పటికి 5 ప్రదర్శనాలు జరిగాయి. ఎప్పుడు చూసినా హాలు కిక్కిరిసే వుంటోంది. తనివి తీరక రెండు మూడు సార్లు వచ్చి చూచే ప్రేక్షకులు కూడా వందలకొలది ఉన్నారు. ఈ నాటక ప్రాశస్త్యాన్ని తెల్పడానికీ ఒక్క ఉదాహరణ చాలు.

యదార్థం ఇలా వుండగా మన "అభ్యుదయ" పత్రికలో, "ప్రయాగ" వారికి మాత్రం ఇది "పచ్చురకం భావకవిత్వం" లాగ కనిపిస్తోంది. ఈ "విద్వాన్" గారు తనకు తెలంగాణా పరిస్థితులేమిటో తెలియకుండానే, ఈ నాటకం అక్కడి "ప్రజల జీవితాన్ని, పోరాటాన్ని వాస్తవికంగా ప్రదర్శించక, దాని కొక వికృత స్వరూపం కల్పించిందని" ఏమేమో వ్రాశారు. పైగా, ఆ పుస్తకాన్ని సరిగా చదవనైనా చదవకుండా అందులోవున్న విషయాలను లేవని, లేనివి వున్నాయని కూడా వ్రాయ సాహసించారు.

"అభ్యుదయ" పత్రికలో "ప్రయాగ" వారి విమర్శనలోని పస ఎంతో చూపుతాను.

"విద్వాన్ ప్రయాగ" ఇలా విమర్శిస్తున్నాడు. ఈ నాటకంలో ఆంధ్రమహా సభ రాజకీయ ప్రభావాన్నిగాని, తెలంగాణా ప్రజలు తమ ప్రాణసమానంగా గౌరవించే నారాయణరెడ్డి, ఎల్లారెడ్డి మొదలైన ప్రజా నాయకుల ప్రభావాన్నిగాని ఏమాత్రా ప్రతిబింబించదు" అంటున్నాడు. దీనికి ఆ నారాయణరెడ్డిగారే చక్కని సమాధానం చెప్పారు.

27-8-47 తేదీని బెజవాడలో జరిగిన "మాభూమి" ప్రదర్శనాన్ని చూచి, హాలులోవున్న దాదాపు 2 వేలమంది

ప్రేక్షకుల ఎదుట నారాయణరెడ్డిగారు "ఈ నాటకం నేటి తెలంగాణా ప్రజా జీవితాన్ని ఆంధ్రమహాసభ నాయకత్వాన వారు సల్పే పోరాటాన్ని ఎంతో సహజంగా చిత్రించుతోంది" అని ప్రశంసించారు. నేటి తెలంగాణాను గురించి ప్రయాగవారికున్న "జ్ఞానం" ఎంతో తెల్పడానికి ఇంతకంటే ఏమికావాలి?

తెలంగాణాలో ప్రజా ఉద్యమం ఎలా వ్యాపించిందో ప్రయాగవారికి ఏమీ తెలియదనడానికి ఇంకో ఉదాహరణ చూపుతాను. "ఒక్కరోజుకూడా లేని వ్యవధానంలో ఊరూనాడూ కలిసినట్లు చూపడం నేటి వాస్తవిక ప్రజాజీవితాన్ని ప్రజాసమస్యలను ప్రజల రాజకీయస్థాయిని అర్థంచేసుకోడం అనిపించుకోదు" అని ఆయన అంటున్నారు.

ఒక్కరోజులో ఊరూనాడూ ఏకమవడమనేది అంతకుపూర్వమే ఎంతో కాలంనుంచి దేశముఖు జరిపే దురాగతాలపట్ల ప్రజలలో రగులుతున్న ప్రతీకారవాంఛ బహిర్గతమయ్యే ఒక ప్రత్యక్ష సంఘటన తప్ప మరేమీ కాదు. నల్లగొండ జిల్లాలో దేశముఖుల దురంతాల నరికట్టడానికి బయలుదేరిన ఆంధ్రమహాసభ ఉద్యమం గ్రామ గ్రామానికీ ఎలా వ్యాపించిందోకూడా చూడవచ్చు. ఒక గ్రామంలో ఆంధ్రమహాసభను (సంఘాన్ని) ఏర్పరచుకున్న ప్రజలంతా పెద్ద ఊరేగింపుగా ప్రక్కగ్రామాలకు వెళ్ళడం, ఆ వూళ్లలోని వారందరినీ సంఘంలోచేర్చడం, యిలా గ్రామాలకు గ్రామాలుపూర్తిగా సంఘంలోచేరి మర్నాడు నుంచీ దేశముఖులకు వెట్టిచేయడం, లంచాలివ్వడం వగైరా మానివేసి, కట్టుగా దౌర్జన్యాల నెదిరించడం సాగించారు. ఇది తెలుసుకోకుండా అదంతా ఒక రోజులోనే జరిగింది కనుక అది నేటి వాస్తవిక ప్రజాజీవితాన్ని చిత్రించడం లేదనడంలో ప్రజా ఉద్యమాలను, ప్రజల రాజకీయస్థాయిని అర్థంచేసుకోలేకపోయినది ఎవరు? "ప్రయాగ" వారా? ఆసత్యాన్ని చిత్రించిన "మాభూమి" నాటకరచయితలా?

పోతే ప్రజాసమస్యలపట్ల ఈ "అభ్యుదయ విద్వాంసు" డికి వున్న గౌరవం కూడా ఎంతో చూడండి. "ఏదోఒక మేకపోతును ఎత్తుకు పోకుండా దేవర పోతునే ఎత్తుకు పోవడం - ఎవరో త్రాగుబోతులు ఒక స్త్రీని అల్లరిచేయడం - ఇవే ఇవాళ ప్రజలందరినీ కలవరపరచి ఐక్యతను సాధించగల బలమైన సమస్యలు కావు" అని సెలవిచ్చాడు. ఈయన దృష్టిలో స్త్రీలను అల్లరిచేయడం అనేది "బలమైన సమస్య" కావాలంటే ఆ దేశముఖు ముఠా రౌడీలు గ్రామంలోని స్త్రీలందరినీకూడా అల్లరిచేయాలన్నమాట. అంతవరకూ అది కలవరపర్చదన్నమాట. ఈయన దృష్టిలో ప్రతివూరూ ఒక అమునూరు (ఈ గ్రామంలో నైజాంపోలీసులచే చాలా మంది తెలుగుస్త్రీలు చెరచబడ్డారు) కావాలన్నమాట! ఇంకా నయం శాస్త్రుర్లుగారు అంతటితో ఆగారు. స్వయంగా చూస్తే తప్ప అలాంటివి జరిగాయని నమ్మడానికి వీలులేదని, అప్పుడుగాని మానవుణ్ణి అది కలవరపరచదని అనలేదు;

అదీగాక ఇలాగ స్త్రీలను అల్లరి చేయడం గొల్లల మేకపోతులను ఎత్తుకుపోవడం రైతుల గిత్తలను తోలుకుపోవడం మొదలైన దురాగతాలు దేశముఖు రౌడీలు నిత్యం సాగించుతున్నాగనే విషయం నాటకం చదివిన ప్రతి వారికీ తెలుస్తుంది. అయినా "ప్రయాగ" వారికి ఇంకా సంతృప్తి కలుగలేదు కాబోలు! అలాగే బందగీ సమాధివద్ద ఏవోసమస్యల జాబితా వల్లించి కథానాయకుడు వీరారెడ్డి వగైరా సంఘం పెట్టుకోవాలనుకుంటారు అని అవహేళన చేశారు. దేశముఖు రైతులను చంపించడం వారిభూములను లాగుకోవడం వెట్టిచేయించుకోడం లంచాలు గుంజడం దొంగపద్దులు వ్రాయడం రైతులకు అవసరమైన బండి పట్టాలు నూనె వగైరా సరకులు అందనివ్వక పోవడం జమీందారురౌడీలు రైతులను కొట్టడం స్త్రీలను అల్లరిచేయడం ఇలాంటి వన్నీ "ఏవోసమస్యల జాబితా"గా కనిపిస్తున్నాయి వీరికి!

పైగా దయ్యాలు వేదాలను వల్లించినట్లుగా ఈ రచన "రంగుపూసి వాస్తవాన్ని మరుగుపరచి ప్రజల్ని సంతృప్తిపరచడానికి ప్రయత్నిస్తుంది" అని మాగ్జింగోర్కీ అన్న మాటలను ఇక్కడ వల్లిస్తున్నాడు.

* * *

దీనితో పాటు నాటకాన్ని సరిగా చదవకుండానే "విద్వాన్ ప్రయాగ" విసిరిన విసురులు కూడా మచ్చుకు రెండు చూపుతాను.

"అతి ప్రధానమైన లెవీ సమస్యమీద జరుగుతున్న పోరాటాలప్రభావం ఇందులో ప్రతిబింబించడం లేద"ని ఒక విమర్శ. కాని నాటకంలో మనకు కనిపించే దేమిటి? రైతులు క్రిందటి సంవత్సరం ఇచ్చిన లెవీ ధాన్యం బాపతు సొమ్మును దేశముఖు, పట్వారీ కలిసి కొట్టేస్తే, ముందు ఆసొమ్ము సంగతి ఏమిటని రైతులు అడుగుతారు. తరువాత పండక పోయినా లెవీ కట్టమని నిర్బంధిస్తే, కట్టలేమని జవాబు చెబుతారు. 20 వేల యకరాలున్న దేశముఖును, 6 వేల యకరాలున్న పట్వారీని ముందు వారి వంతు లెవీనిచెల్లించమని డిమాండుచేస్తారు. లెవీ సమస్యను ఉపయోగించుకొని దేశముఖు, పట్వారీలు నైజాం ప్రభుత్వపు పోలీసు బలగాన్ని తెచ్చి దాడి జరిపిస్తారు. ఆ సందర్భంలోనే యిరువురిని కాల్చి చంపుతారు. లెవీ సమస్యపై నాటకంలో ఇంతవుంటే, ఆసమస్య ప్రభావమే చూపలేదనడం పుస్తకాన్ని చదవకుండా చేసే గుడ్డివిమర్శ కాదా?

అలాగే "కోటలోకి వచ్చినప్పుడు కూడా రైతులు అతన్ని (దేశముఖును) లెక్కచెయ్యరు" అని మరో విమర్శ. మొదటివిషయం రైతులుకోటలోకి వచ్చినప్పుడు అక్కడ దేశముఖు లేడు. వారు పట్వారీ తోనే ముఖాముఖి మాట్లాడుతారుగాని దేశముఖుతో కాదు. అదీ గాక ఒక వేళ నిజంగానే దేశముఖు ఎదురుగావున్నా అందులో "ప్రయాగ" వారికి కలిగినకష్టం ఏమిటో మనకి బోధపడదు. దుర్మార్గుడైన దేశముఖును ఎదిరించడానికి ఐక్యమౌతున్న చైతన్యవంతులవుతున్న రైతులు అతనంటే భయపడవలసిన అవసరం ఏముంది? దేశముఖుయొక్క రీవిని చూపడంకోసం రైతు

లలో కలుగుతున్న విప్లవచైతన్యాన్ని ధైర్యాన్ని ప్రదర్శించకుండా వుండాలనా ఈ "అభ్యుదయకవి" అభిప్రాయం?

* * *

అదే విధంగా, ప్రజాజీవితాన్ని, సమస్యల్ని, పోరాటాన్ని చిత్రించే నాటకం ఎలా వుండాలో తన విమర్శలో ప్రయాగ కొన్ని అభిప్రాయాలు ప్రకటించాడు. అవన్నీ కూడా ప్రజాఉద్యమాలు ఎలా నిర్మింపబడి సాగుతూ వుంటాయో ఆయనకు తెలియదనే సత్యాన్నే వెల్లడిచేస్తాయి. స్థలాభావంచే అవన్నీ ఒక్కొక్కటే తీసుకుని చర్చించడం లేదు. కాని చివరకు ఒక్కముక్క మాత్రం చెప్పి ముగిస్తాను. అక్కసుకొద్దీ వాస్తవ పరిస్థితులు తెలియకుండా అలాంటి అపసవ్యపు వ్రాతలు వ్రాయడంవల్ల నైజాముకు, దేశముఖులకు తోడ్పడినవారవడంతప్ప మరొకటికాదు. ఇది అభ్యుదయ రచయిత లందరికీ తలవంపు. ఆంధ్ర అభ్యుదయరచయిత లెవరూ దీనిని సహించరని ఆశిస్తున్నాను.

—"రావు"

('నవయుగ' నుంచి కృతజ్ఞతతో)

# సంపాదకులకు బహిరంగలేఖ

బెజవాడ,
5—9—47.

అయ్యా!

"అభ్యుదయలో 'మాభూమి' పై ప్రయాగవారి సమీక్ష చూచినాను. అది వారి వక్రబుద్ధిని, అసహనాన్ని తెలియజేస్తోంది గాని, గ్రంథ సమీక్షకు గీటురాయిగా లేదు. ఇందు కనేక కారణాలున్నాయి కాని, *స్థలాభావముచే ఒక కారణాన్ని మాత్రమే ఇందుదహరిస్తున్నాను.

"ఆంధ్రప్రజానాట్యమండలి రాష్ట్ర కృష్ణాదళాలు రెండూ పలుతావుల 'మాభూమి' నాటకాన్ని ప్రదర్శించాయి. ప్రతి ప్రదర్శనానికి టిక్కెట్లు దొరకక నిరుత్సాహముతో తిరిగిపోయే జనం వందలాది వుంటూవచ్చారు. ఒకటిన్నర మాసంలోనే బెజవాడలో అయిదు ప్రదర్శనా లివ్వబడినాయి. బెజవాడ, తెనాలి, రాజమండ్రి లాంటి పట్టణాలలో ఒకే రాత్రి రెండేసి ప్రదర్శనా లివ్వవలసి రావటమే ఈ నాటక ప్రాశస్త్యానికి నిదర్శనము. అంతేగాక గొప్ప గొప్ప పండితులు, కవులు, నటకులు, విమర్శకులు, విజ్ఞానవేత్తలు ఎందరో ప్రదర్శనాలను చూచి ప్రశంసించారు. అందులో మచ్చుకు ది 10-7-47 వ తేదీన శ్రీరామా టాకీస్‌లో కృష్ణాదళం వారి 'మాభూమి' ప్రదర్శనాన్ని చూచి, ఒక పండితుడు ఇచ్చిన అభిప్రాయాన్ని మీకు పంపుతున్నాను. అయితే సామాజికులనే వెర్రి వెంగళప్పలగా సృష్టించిన ప్రయాగవారు ఇదంతా ప్రదర్శకుల నైపుణ్యము వల్లనే యనవచ్చు; కాని- అసలు వెంట్రుక లుంటేగా కొప్పయినా, బర్మాముడయినా, వాలుజడయినా, మరొకటేదైనా యువతి కళానైపుణ్యముతో తీర్చి దిద్ది శృంగారాన్నొలికించటానికి? దీనిని బట్టి రాజకీయ

పరిజ్ఞానములేనిది రచయితలకా? ఈ అభ్యుదయముసుగు వేసుకున్న ప్రయోగవారికా? సహృదయులయిన చదువరులు నిర్ణయించక పోరు.

"దయయుంచి నా ఈబహిరంగలేఖను ఇందుతో జతపర్చి పంపిన విశ్వనాధ సత్యనారాయణగారి అభిప్రాయాన్ని అభ్యుదయ కాముకులు ప్రజాస్వామిక సూత్రాలను తుచ అనుసరించాలనే మీరు మీ 'అభ్యుదయ'లో ప్రకటించెదరని ఆశిస్తున్నాను.

కోడూరు అచ్చయ్య,
డైరక్టరు:
ఆంధ్రప్రజా నాట్యమండలి,
కృష్ణాదళం.

* ఇందులో చెప్పకున్న 'స్థలాభావం' అభ్యుదయకు సంబంధించింది కాదు. లేఖకుని లేఖలోది మాత్రమే. —సం.

# శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారి అభిప్రాయం

"A true critic ought to dwell upon excellencies rather than defects, to discover the concealed beauties of a writer, and communicate to the world, such things as are worth its observations."

*'Addison'*

మాభూమి నాటకము యిటీవలనే ప్రజాశక్తి ప్రచురణాలయమువారిచే ప్రచురింపబడినది. ఆంధ్రప్రజా నాట్యమండలి కృష్ణా దళమువారిచేతను ప్రదర్శింప బడుచున్నది ఈ నాటక ప్రదర్శనము ప్రేక్షకుల మెప్పు పొందుచున్న సంగతి ప్రజాశక్తి పాఠకులకు పరిచయమే. ఈనాటకము అభ్యుదయలో అన్నివిధాల ఖండింపబడుట పాఠకులకు తెలిసిన సంగతే. ప్రేక్షక ప్రముఖులచే ప్రస్తుతింపబడినదానిని, అభ్యుదయలో అనాదరింపబడుట అందరకు ఆశ్చర్యముగా వుండవచ్చు. యిందులో యెవరు రాగ ద్వేషాలకు గురియైనారు? లేక వుభయుల దృక్పధాలయందు యెంత సత్యమున్నది అన్న విషయములు ఆలోచించదగినవి.

నాటకాన్ని పెక్కురీతుల విమర్శించవచ్చు. ప్రధానముగా గమనింప దగినవి 1. కధావస్తువు, 2. భాష, 3. పాత్రలు.

## కధా వస్తువు

నాటకము అధికముగా ఆదరింప బడుటకు, కధావస్తువు విశేషంగా పనిజేస్తుంది. శైలి, పాత్రలు అంతగా గమనింపబడవు. సాధారణ ప్రజలు అధికంగా వస్తువుకే ప్రాధాన్యము నిస్తారు. నాటకములోనే గాక, నేడు అన్నిటా శిల్పమున కంటె వస్తువునకే ప్రాముఖ్యమిస్తున్నారు. ఇందులోని వస్తువు కాలానుగుణ్యమైనదే గాక, సరికొత్త విషయముకూడా. వస్తువు సంగ్ర

హాయుగా నుంచుట కూడా ఆదరింపబడడానికి విశేషంగా పని జేస్తుంది. ఇందులోని కథావస్తువు అట్లాగే వున్నది. ఈ నాటకములో ప్రజల చిత్తము నాకర్షించే గుణము పై కారణములవలన అధికముగా ఉన్నది.

## భాష

ఏ గ్రంధానికైనా ప్రాముఖ్యము కలిగించేవి వస్తువు, రచన. యిందులోనివస్తువు మంచిదైనా భాష బాగుండలేదు. రచయితలు వస్తువు విషయములో జూపిన శ్రద్ధ రచనలో చూపించలేదు యేమాత్రం శ్రద్ధ వహించినా, భాష యింతకంటే బాగా వుండేది రచయిత మాటలనే కొద్దిమార్పు చేస్తే యెట్లా వుంటుందో గమనించండి.

రామిరెడ్డి:— మూణ్ణాళ్లు బ్రతికినా అట్లా బ్రతకాలి. (పుట 6)

బ్రతికిన మూన్నాళ్లు అట్లా బ్రతకాలి.

భాను:— యెందుకు జంపడూ-యిట్లాంటి మన దాదాలంతా చేతులు ముడుచుకు కూర్చుంటే యేం చేయకుండా? (పుట 7)

యిట్లాంటి మన దాదాలంతా చేతులు ముడుచుకుని కూర్చుంటే ఎందుకు చంపడూ?

కమల:— యే తగాదా వచ్చినా, యీాయనే తీర్పు జెప్పేవాడటుగా దాదా? (పు 7)

దాదా! యే తగాదా వచ్చినా యీాయనే తీర్చేవాడటుగా? సీత. అన్న జంపుతాడూ? (పు 7)

అన్న చంపుతాడా?

ఇట్లావున్నది భాష. ఈ నాటకం చదివి యెవ్వరూ ఆనందించరు.

## —: పాత్రలు :—

నాటకములోని పాత్రలలో వైవిధ్యముండాలి. మనుష్యుల రూపములందు, స్వరములందెట్లు భిన్నత్వ ముంటుందో అట్లే పాత్రల స్వభావములు భిన్నముగా నుంటవి. పాత్రల స్వభావములు ఆయా పాత్రల కనుగుణ్యముగా ప్రదర్శింప బడాలి. అట్లా ప్రదర్శింపబడలేదు.

కథానాయకుడు వీరారెడ్డి, సుభాను రామిరెడ్డి, వీరంతా ఎలా ఒక గ్రూపో వీరి స్వభావాదులుగూడా అచ్చున గుద్దినట్లొకేమాదిరిగా నున్నవి. వీరారెడ్డిలో కొంత హెచ్చు సంస్కారము కనపడాలి. పట్వారీని, మస్తానును ఆఖరు రంగములో సుభాను, రామిరెడ్డి, యెల్లమందలవలె తిట్టడం ఉచితము కాదు. పాదాక్రాంతమైనవాడిని క్షమించుటలో నాయకుడు ఔదార్యమును జూపవలసినది.

పై ముగ్గురవలెనే, దేశముఖు, పట్వారీ, రౌడీల స్వభావము శత్రువులయెడ ఒక మాదిరిగానే చిత్రింపబడినది. వీరి ముగ్గుర క్రూరత్వములోను భేదము చూపించాలి. దేశముఖులో ఠీవి, దర్పము కన్పించాలి. మస్తాన్ మాదిరి అతను తన గొప్పతనమును గూర్చి చెప్పుకోరాదు. అతను సాధారణ మనిషి కాదు. అతని క్రూరత్వములోకూడా హుందాతనము వుండాలి. పట్వారీ క్రూర

త్వము పేచీలతోను మోసము తోను వుండాలి. మాటలలో కనపడగూడదు.

భాష గూడా నైజాం తెలుగు వుపయోగింప బడలేదు-కొన్ని చోట్ల పాత్రోచితమైన భాష గాదు. ప్రధాన పాత్రలు సరిగా పోషింపబడలేదు.

ఈ నాటకములోని గుణావగుణములు మరొక విధము గా గుర్తించవచ్చు. గుణాలు వస్తువు కాలా ను గు ణ్య మైనదై సరి కొత్తదై సంగ్రహముగానుండి ఆకర్షణీయము గా నున్నది పాత్రల సంభాషణ దీర్ఘ ముగాక, కథాగమనమునకు తోడ్పడు మన్నది. పద్యాలు లేకపోవుట, పాటలు నలుగురు కలసి పాడేటట్లుగా నుండుట మరొకసుగుణము. భాష అందరకు తెలిసే టట్లుగా నుండుట మొదలైన మంచి గుణములు లేకపోలేదు.

—: అవగుణాలు :—

రచనాశిల్పము ఏమీలేదు పాత్రల గుణ, శీల, గౌరవాదులు పాటింప బడలేదు హృదయమును కదిలించు సన్నివేశములు గాని, సజీవపాత్ర పోషణ గాని లేదు. హాస్యము, చమత్కృతిగాక, వికృతముగా నున్నది కావ్యగుణములు లేవు. నాటకము దృశ్యకావ్యమన్న మాట మరువరాదు. తెలంగాణాలో కాంగ్రెసు, కమ్యూనిస్టు అనే భేదము లేకుండా వారిద్దరు ఆంధ్రమహాసభవారు ప్రజాపోరాటమును సాగించుచున్న సమయములో, ఆంధ్రమహాసభా సభ్యులద్వారా కాంగ్రెసు ను, కాంగ్రెసు ప్రధాననాయకులను హీనపరచు యత్నము క్షంతవ్యంకాదు.

—. నాటకమునకు గీటు రాయి :—

సాహిత్య శాఖల్లో ఒక్కొక్క దానికి ఒక్కొక్క విశిష్టత గలదు. పురాణమువిని ఆనందించేది, కావ్యము చదివి ఆనందించేది. నాటకము చూచి ఆనందించేది. నాటకము రంగస్థలము మీద రక్తి కట్టకపోతే సాహిత్య పరముగా అది వుత్తమ మైనదైనా మంచినాటకముగా గుర్తింపబడదు. నాటకము దేవతల నేత్రయజ్ఞ మన్నారు పూర్వులు. నాటకపు గొప్ప, సాహిత్యమునుబట్టిగాక, ప్రదర్శనమునుబట్టి రావాలి. వేయేల నాటకముయొక్క ప్రధాన గుణము ప్రదర్శనయోగ్యముగానుండుటే. యీ నాటకమును విమర్శనా దృష్టితో జూచినట్లయితే యెన్ని లోపములున్నను ప్రదర్శనయోగ్యము గా నున్నది.

— ప్రదర్శన విజయానికి :—

ప్రదర్శనము బాగా వుండడానికి, కవి, నటుడు, ప్రేక్షకులు, సమాన భాగస్వాములే. నాటకములో శిల్పము లేకపోయినా, యితివృత్తము ప్రస్తుత కాలావసరానుగుణ్యమైన దగుట వల్లను, విసుగు పుట్టింపక మూడు గంటలలో ముగింప ననుకూలమైనదిగా నుండుటయు, యితివృత్తముభాష అందరకు అందుబాటులోనుండుట, నటులు సమర్థులై యుండుట వలనను, నాటకముయొక్క ఆశయము ప్రేక్షకలోకాన్నుండి అప్రయత్న

సానుభూతులను పొందుచున్నం మన ప్రదర్శనం జయప్రద మగుచున్నది.

ఈ నాటకాన్ని గూర్చి ఒక్క వాక్యములో చెప్పాలంటే, దీనిని చదివిన వారెవ్వరు మెచ్చరు. చూచిన వారెవ్వరు ప్రశంసింపకుండా వుండజాలరు. నాటక వస్తువు, నటులు దీని గొప్పతనమునకు కారణము—

—♦ తుది పలుకు ♦—

నేడు నైజాంసమస్య ప్రజాసమస్యయై, భారత సమస్యగా పరిగణింపబడుచున్నది ఆంధ్రులకు, అందరికంటె యిందధిక సంబంధముకలదు. అది నేడు మన జీవన మరణ సమస్యగా నున్నది. అట్టి సమస్యను నాటక రూపముగా తీసుకొని ప్రజలలో ప్రచార, ప్రబోధములు గావించుట రచయితల ఉద్దేశ్యము. దానిక సాహిత్య గౌరవము సంపాదించవలెనే సంకల్పము వారికిలేదు సామాజిక ప్రయోజనము కొరకు వ్రాయబడిన నాటకము ఆప్రయోజనము ప్రదర్శనముల ద్వారా అధికముగా సాధింప బడుచున్నది

కవి యే దృష్టితో వ్రాశాడు? యెవరి కొరకు వ్రాశాడు? యే భావాన్ని కలుగజేయ గలిగాడు? అనేవి యీ నాటకం సందర్భములో ఆలోచింపదగిన ప్రశ్నలు. గాని సాహిత్యములో దానికెట్టి గౌరవమున్నది అనికాదు కవి ప్రచారదృష్టితో ప్రజలకొరకు వ్రాసి, ఆర్థిక రాజకీయ హక్కులకొరకు పోరాడవలెననే భావమును కలిగిస్తూ, నేటి నైజాం ప్రజల పోరాటమునకు ప్రజలసానుభూతి, సహాయ్యాలను సంపాదింప సహాయ్య పడుచున్నది. ఏనుక రచయితల వుద్దేశము నెరవేరినట్లే.

ఈ నాటి రాజకీయ నాటకాలలో, యీ నాటకములో గల అవగుణాలు అధికముగా వుంటూ వేవున్నవి. ఈ నాటి నాటకాలలో నేకాదు. విమర్శకులదృష్టిలో ఏ నాటకం గొప్ప దనిపించు కున్నది?

"కాళిదాసస్య సర్వస్వమభిజ్ఞాన—
శాకుంతలం — అని ప్రతీతి

విమర్శకులు - కవికులగురువు కాళిదాసు నాటకము మెచ్చుకున్న దెంత వరకు? కావ్యాల్లో నాటకం రమ్యమన్నారు నాటకాల్లో "శకుంతల రమ్యమన్నారు. దానిలో నాల్గో అంకము, ఆ అంకములో నాల్గు శ్లోకములు మాత్రమే ఎన్నదగినవన్నారు. యీ మాదిరగా పాండవ స్వర్గారోహణమైనది "మహాకవి కాళిదాసు శాకుంతలం."

సంస్కృత నాటక సాహిత్యమంతా నుద్ధించి, వర్ణనా శిల్పమున కాళిదాసు, రస పోషణమున భవభూతి, పాత్రపోషణలో శూద్రకుడు, చమత్కార కథాకల్పనల తోటి రసమయ సన్నివేశములను గూర్చుటలో భాసుడు గొప్ప అన్నది విమర్శక లోకము—

వందలకొలదిగానున్న ఆంధ్ర నాటక సాహిత్య రంగములో, నాటకములని చెప్పుకోదగినవి విమర్శకుల దృష్టిలో అయిదారు మాత్రమే—

ఈ నాటకములో లోపమున్నా ఉత్తమకవులు యెవరూ యిట్టి సమస్యల నెత్తుకొని గ్రంథరచనచేసి ప్రజాప్రబోధము చేయుటలేదు. కనుక, ఆకలిగొన్న వాడికి గంజినీళ్లు పోసినట్లు వీరి రచనలు ప్రజాసాహిత్య తృష్ణను కొంతవరకైననూ తీరుస్తున్నవి. ఉత్తమ కవులిట్టి గ్రంధాలు వ్రాస్తే దీనిని యెవరూ. చూడకపోవచ్చు. కనుక అంతవరకు దీని ప్రయోజనము అవసరము లేకపోలేదు—

నాటకము సాహిత్యములో ఉత్తమ గౌరవము గాంచినది. దానిని, వైదుష్యము గలవారు, అనుభవజ్ఞులు, పరిణత బుద్ధులు చేపట్టాలి. నేటి రచయితలు గ్రంధరచనయందు కన్పరచు ఉత్సాహము, అర్హత సంపాదించుటలో కన్పరచుటలేదు – అట్టి గుణములే యీ కవులయందును గలవు.

వీరుచేస్తున్న సాహిత్యసేవ, గమనింప తగినది. పిన్నలగు వీరు యింకా పెరగాలి–యిట్టి రచనలకు–అప్పుడు అన్నివిధాలా ఆనందము కల్గుతుంది వీరుగ్రంధరచనయందధిక కృషిజేసి పెద్దలకు చూపించి ప్రకటిస్తే బాగుండునేమో.—

ప్రజాశక్తి ప్రచురణాలయమువారు ఉత్తమ గ్రంధకర్తలద్వారా, ఉత్తమ రచనలు చేయించిన నధిక ప్రయోజనం ఉంటుంది. సామయిక వాఙ్మయము వలన కొంత ప్రయోజనము మాత్రమే వున్నది. ఇట్టి సమస్యలనుకూడా ఉత్తమ రచయితలు చేపట్టినట్టయితే, గోర్కీ, టాల్‌స్టాయిలవలె ఉత్తమ వాఙ్మయ నిర్మాతలుకూడా కాగలరు.

'If criticism is fair accespt it, with respect and thanks, if it is fair but unkind, accespt with respect without thanks, if it is unfair and unkind, treat it with contempt;

**D. Alembut.**

# ప్రజాశక్తి విమర్శ

## 'ప్రయాగ' వ్రాతలకు జవాబు

"అభ్యుదయ అగష్టుసంచికలో 'మాభూమి' నాటకంపైన వ్రాసిన విమర్శన చదివారా? ప్రజలను ఉత్తేజపరుస్తూ, వారి అభిమానాన్ని చూరగొంటున్న నాటకాన్ని యిలా పడతిట్టడం విమర్శన అనిపించుకుంటుందా? అలాంటి వ్రాతలను ప్రకటించడం అభ్యుదయకు తగునా?" అని అనేకమంది పాఠకులు ప్రశ్నించుతున్నారు. 'ప్రయాగ' అవాకులు – చెవాకులకు ప్రజాశక్తిలో సమాధానం ఇవ్వండి' అని కోరుతూ మా కార్యాలయానికి జాబులు వస్తున్నాయి. అందుచేత ప్రజాసాహిత్యంలో ప్రయాగవారి విమర్శనకున్న యధార్థాన్ని చూపడానికి యీక్రిందివ్యాసాన్ని ప్రకటించుతున్నాం."

# సంస్కృతిని గురించి లెనిన్ అభిప్రాయాలు

సంస్కృతిని గురించిన లెనిన్ అభిప్రాయాలు ప్రధానాంశాలను బట్టి మార్క్సు, ఎంగెల్సుల అభిప్రాయాల వంటివే. ఒక్క పారిశ్రామిక జీవితం తప్పితే, సాంఘిక జీవితంలోని అన్ని విధానాలు సంస్కృతి అనే అర్థంలో ఇమిడిపోతాయి. కాని, మానవుడిచేత ఏ మార్పూ పొందని ప్రకృతి కంటె సంస్కృతి విలక్షణమైన దనుకొన్నప్పుడు, నిజానికి పారిశ్రామిక జీవిత విధానాలు కూడా సంస్కృతిలోకే వస్తాయి వైజ్ఞానిక రూపాలన్నీ కూడా సంస్కృతిలోకే వస్తాయి. మతం, వేదాంతం, శాస్త్రం, కళ మొదలైన తాత్విక రూపాలేకాక, సూటిగా జీవితరీతులతో సంబంధం గల నీతి, మొదలైన సంస్కృతి రూపాలుకూడా, సిద్ధాంతరీత్యానే కాక, ఆచరణరీత్యాను వాస్తవికంగాను, వాటి తాత్వికమైన ఆచరణీయమైన రూపాలన్నీ వైజ్ఞానిక రూపాల నబడతాయి. అన్యోన్యం తమ ప్రభావాలను విరజిమ్ముతూ ఈ సంస్కృతీ రూపాలన్నీ కొంత వరకు సమాజార్థిక పునాదిమీద ఒత్తిడి తెస్తాయి. తేల్చి చెప్పాలంటే, ఈసంస్కృతీ రూపాలనూ వీటి ప్రభావాలనూ నిర్ణయించేది ఉత్పత్తి విధానమే. ఉత్పత్తి విధానాన్ని బట్టే ఆస్తి సంబధాల్లో మార్పులు వస్తాయి; ఉత్పత్తి కోసం మనుష్యులు వివిధ సమూహాలుగా ఏర్పడుతారు. ఇక్కడ ఒక్కొక్కపనిలో ప్రత్యేకతను బట్టి, ఒకొక్కసమూహంగాకాక వివిధవర్గాలుగా ఏర్పడడం అనేది ప్రత్యేకంగు రించవలసివుంది. ఉత్పత్తివిధానంలో ఈవివిధవర్గాలువివిధ పాత్రలు నిర్వహిస్తాయి. ఉత్పత్తి సాధనాలమీదా, ఉత్పత్తి వస్తువులమీదా ఒకొక వర్గానికి ఒకొక్క రకం హక్కులు వుంటాయి. ఏఒక సమాజం యొక్క

రాజకీయ జీవితం గానీ, తక్కిన అన్ని తాత్విక వైజ్ఞానిక రూపాలు గానీ, రాజ్యాంగనిర్మాణం గానీ ఈ వర్గనిర్మాణం మీదే ఆధార పడి వుంటాయి.

మార్క్సు లెనిన్ల ఈ ప్రధాన సూత్రాలను మనం దృష్టిలో పెట్టుకొని, సంస్కృతిని గురించి ప్రతిభావంతంగా లెనిన్ చెప్పిన అమూల్యమైన అభిప్రాయాలను పరిశీలిద్దాం. సాహిత్య పరిశ్రమకు అవసరమైన పునాది ఇదే.

సాహిత్య మీమాంసకుల మీద తమనిశిత ప్రభావాన్ని విరజిమ్మిన లెనిన్, ప్లెఖనోవ్‌ల సంస్కృతిని గూర్చిన అభిప్రాయాలలోని వ్యత్యాసం ఇక్కడ చర్చించడం చాలా ఉపయోగకరంగా వుంటుంది. చాలా కాలం అద్వితీయంగా మార్క్సు ఎంగెల్సుల అనుచరుడుగా చలామణి అయిన ప్లెఖనోవ్ మీద, రష్యాలోని ఒకానొక విప్లవాత్మక మేధావి వర్గపు ప్రభావం వుంది. ఈ మేధావులు కార్మిక వర్గాన్ని గుర్తించారే కాని, పూర్తిగా వారిలో ఇమిడిపోలేక పోయారు ఈ ప్రభావమే, సాహిత్యాన్ని గూర్చిన ప్లెఖనోవ్ అభిప్రాయాలు అనేక సాహిత్య సమస్యలకు ఆయన సూచించిన పరిష్కారాలలోను కనిపిస్తుంది.

సవిమర్శకంగా ఆలోచించే మేధావుల వల్లనే మానవజాతి చరిత్ర సమస్తం నిర్మించబడ్డదని నమ్మిన నరోద్నికీ యొక్క ఊహావాదాన్ని ప్రతిఘటిస్తూ, సంస్కృతి అందులోను ప్రత్యేకంగా సాహిత్యం కేవలం అప్పటప్పటి వాస్తవిక పరిస్థితుల వల్లనే వర్గస్వభావాన్ని బట్టీ, ఉద్భవిస్తుందని ప్లెఖనోవ్ చెప్పాడు. ఈ దృష్టితో చూస్తే, ఏ సంస్కృతి గానీ వాస్తవిక పరిస్థితులకు అనుకూలమైనదా? ప్రతికూలమైనదా అన్న ప్రశ్నకు అవకాశం లేదు. అంతే కాదు, ఏ సంస్కృతీరూపాన్ని గానీ అభినందించడానికీ, విమర్శించడానికీ గూడా ఆస్కారం లేదు. ప్లెఖనోవ్ దృష్టిలో సాహిత్య మీమాంస అంటే ఒకానొక సంఘటన, దాని హేతువులూ, తప్పనిసరైన వాటి పరిణామం చర్చించడం మాత్రమే అవుతుంది.

ఈ సమస్యలకు లెనిన్ చెప్పిన విధానం వేరు, ఒక ప్రత్యేకమైన సంస్కృతీస్వభావాలను, వాటి వర్గ సాజాత్యం దృష్టిలో చర్చించడం యొక్క ప్రాముఖ్యాన్ని ఆయన బాగానే దృష్టిలో పెట్టుకున్నాడు. ఆయన దృష్టిలో ఈ సంస్కృతీ మీమాంస ప్రథమ సోపానం మాత్రమే. కార్మికవర్గం యొక్క చైతన్యవంతమైన నిర్మాణయుత మైన చారిత్రక పాత్రను గురించి, కార్మికవర్గ ప్రయోజనాలకు అనుగుణంగా, పురాతన సంస్కృతిని సవిమర్శకంగా వినియోగించుకోడానికీ, నూతన సంస్కృతీ రూపాలను నిర్మించుకోడానికీ, ఈ సంస్కృతీ మీమాంస ఒకసాధనం మాత్రమే. ప్లెఖనోవ్ తానూహించిన ఏదో అగోచరమైన భవిష్యత్తులో ఎక్కడో, నిర్లిప్తమైన సిద్ధాంతానికీ, నిర్మాణానికీ మధ్య ఏదోసంఘర్షణ వున్నదని చెప్పాడు! నిస్సందేహంగా ఇదే అతని విశిష్టత. కాని, లెనిన్ అలాకాదు. ధనికవాదాన్ని 'నిర్మూలంచెయ్యడంలోను, ప్రత్యక్షంగా సామ్యవాద జగత్తును నిర్మించడంలోను లెనిన్ నాయకత్వం వహించాడు. పరిశోధనాపరిశ్రమలను ఆయన సూటిగా విప్లవ పంథాకు అనుగుణంగా వినియోగించుకొన్నాడు. అందువల్లనే లెనిన్ అభిప్రాయాలకు పూర్తిగా కొత్తదనం వచ్చింది. అవి, మార్క్సు యొక్క విప్లవాత్మకమైన అభిప్రాయాలతో పూర్తిగా అన్వయిస్తాయి. కనుక, సమగ్రంగా మార్క్సిస్టు దృక్పథంలోవే అవుతాయి. కాని, అక్కడ లెనిన్ ప్రత్యేకతవుంది. మొట్టమొదటి కార్మిక విప్లవపు కాలం, సిద్ధహస్తుడైన లెనిన్ యొక్క ప్రతిభవల్ల, పూర్తిగా సంస్కృతిని తాత్వికంగా అవగతం చేసుకునే స్వభావాన్నే బలంగా వ్యక్తపరచింది.

పురాతన సంస్కృతినీ, మనకు ఇంతకుపూర్వమే వున్న బూర్జువా సంస్కృతినీ, ప్రత్యేకం, పతనం చెందుతున్న ధనిక వర్గపు సంస్కృతినీ, నిరంతరం లెనిన్ విమర్శిస్తూనే వచ్చాడు, చారిత్రకంగా ఈ యుగాల్లోవచ్చిన సంస్కృతిలో ముఖ్యమైనదంతా ఆయన తీవ్రవిమర్శకు పాత్రమైంది.

పురాతన సంస్కృతిని లెనిన్ అనేక పర్యాయాలు తీవ్రంగా విమర్శించాడు. కాని. ఆయన పురాతన సంస్కృతిని పూర్తిగా త్రోసిపుచ్చాడనిగానీ, నూతన సంస్కృతీ నిర్మాణంలో కార్మికవర్గం ఆపురాతన సంస్కృతినుంచి నేర్చుకోవలసింది ఏమీ లేదని అన్నాడనిగానీ, దీనిఅర్థం కాదు. ఇది సైన్సు టెక్నాలజీలకేకాక, అన్ని సంస్కృతీ రంగాలకూ వర్తిస్తుంది. పూర్వం వివిధ సమాజాలలో పరిపాలన సాగించిన వివిధవర్గాలు సాంస్కృతికమైన విలువలను నిర్మించాయి. వీటినిపరిశోధించడం, మానవజాతి చరిత్రయొక్క గమనాన్ని తెలుసుకోడానికేకాక, మన తక్షణ ప్రయోజనానికికూడా వినియోగపడుతుంది. 1919 లో లెనిన్ ఒక ఉపన్యాసంలో చెప్పిన మాటలు ఉదహరిస్తాను.

"ధనికవాదం బదాబదలై పోయినంత మాత్రాన ఎవ్వడూ తన పిపాస తీర్చుకోలేడు. ధనికవాదం వదలిపెట్టిపోయినసంస్కృతి నంతటిని తీసుకొని దానితోనే సామ్యవాద జగత్తును నిర్మించాలి. సైన్సు, టెక్నాలజీ, అన్నివిధాలైన విజ్ఞానమూ, కళలూ పూర్తిగ తీసుకోవాలి. ఇది లేకుండా, మనం కమ్యూనిష్టు సమాజ జీవితాన్ని నిర్మించడానికి తగినసమర్థత సంపాదించలేము. ఈ సైన్సు, టెక్నిక్, కళలు అన్నీ ఆయా నిపుణుల పండితుల చేతుల్లోనూ హృదయాల్లోనూ ఉన్నాయి."

1920 లో మరొక ఉపన్యాసంలో లెనిన్ చెప్పిన మాటలు చూడండి.

"ఒక్క చిన్నఅంశాన్ని కూడా జారవిడువకుండా, మానవసమాజం నిర్మించిన ప్రతి విషయాన్నీ మార్క్సు సవిమర్శకంగా వివరించాడు. మానవ మేధస్సుతో నిర్మింపబడిన ప్రతిదాన్నీ ఆయన పరిశోధించాడు. ఒక్కొక్కదాన్నీ విడమర్చి, విమర్శించుకొని, కార్మికోద్యమంలో సరిచూచుకొని, స్పష్టమైన నిర్ణయాలకు వచ్చాడు. బూర్జువా సమాజపు గోడల్లో ఇరుక్కుపోయిన వారుగానీ బూర్జువా అపోహలకు బద్ధులైన వారుగానీ ఇలాంటి నిర్ణయాలకు ఎప్పుడూ రాలేరు. కార్మికవర్గ

సంస్కృతిని గురించి మనం మాట్లాడేటప్పుడు ఈ విషయాన్ని మనం దృష్టిలో పెట్టుకోవాలి. మానవజాతి పరిణామ చరిత్ర అంతటిలోను సృష్టించబడిన సంస్కృతిని గూర్చి ఖచితమైన జ్ఞానం సంపాదించడంవల్లా, దాన్ని సవిమర్శకంగా తెలుసుకోడంవల్లా మాత్రమే కార్మికవర్గ సంస్కృతి నిర్మింపబడుతుంది. ఇలాంటి స్పష్టమైన పరిజ్ఞానం లేకుండా, మన సంస్కృతీ సమస్య లెన్నటికీ పరిష్కారంకావు. కార్మికవర్గ సంస్కృతి అంటే అకస్మాత్తుగా ఆకాశంనుంచి ఊడిపడే వస్తువు కాదు; కార్మికవర్గ సంస్కృతీ వేత్తలమని చెప్పుకునే వాళ్ళు కొత్తగా కనిపెట్టే వస్తువుకాదు. ఎవరైనా అలా అనుకుంటే అది అర్థంలేని ఆలోచన. ధనిక సమాజపు నిరంకుశత్వంలో కూడా మానవజాతి సేకరించిన మహత్తరమైన విజ్ఞాన భండారాలనుంచే, కార్మిక వర్గ సంస్కృతి పెంపొందుతుంది. మానవజాతి భవిష్యత్తునూ, వర్గ పోరాటాన్నీ కార్మిక వర్గ విప్లవారంభాలనూ మార్క్సు వ్రాసిన రాజకీయార్థికశాస్త్రం మనకెలా స్పష్టపరిచిందో, అలాగే వివిధ సంస్కృతీ రూపాలుకూడా, కార్మికవర్గ నియంతృత్వం వైపుకు మానవజాతిని నడిపాయి; ఇంకా ఇంకా నడుపుతున్నాయి."

ఈ పైని చెప్పిన లెనిన్ మాటలనుబట్టి చూస్తే, పురాతన సంస్కృతిని దాని వర్గదృష్టిలోనూ దాని విలువల దృష్టిలోనూ పరిశోధించడమనేది నూతనసంస్కృతీ నిర్మాణానికి ఎలా ప్రథమ సోపానమో బోధపడుతుంది.

'కార్మిక సంస్కృతి' అని చెప్పబడే సంస్కృతీ సిద్ధాంతాన్ని గూర్చిన లెనిన్ విమర్శయొక్క ఆంతర్యం అవగాహన చేసుకోవడం చాలా అవసరం.

పవిత్రమైన కార్మికవర్గ సంస్కృతీ రూపాలనే।వాటినిసాధ్యమైనంత వేగంగా సృష్టిద్దామనే తలంపుతో, కార్మికవర్గ సంస్కృతీ వేత్తల మనుకునేవాళ్లు యంత్రాలమీద వస్తువులను ఉత్పత్తి చేసినట్లుగానే సంస్కృతీ రూపాలను సృష్టించడానికి పూనుకున్నారు. అందువల్ల సంస్కృతీ సమస్య మరీ సంకుచితమైపోయింది. ఈ సంస్కృతి ఏకొద్దిమంది కార్మికులనో తప్పితే

# బలిపీఠాలపై రక్తాక్షరాలు

★ జూలియస్ ఫ్యూజిక్ ★

★

[ గత మహాయుద్ధంలో నాజీదురంతాలకు బలియైన వీరుల్లో ఈ రచయిత ఒకరు. ఈయన 1943 సెప్టెంబరు 8 న నాజీ రాక్షసుల ఉరికంబాని కెర అయినాడు.

తనకు భవిష్యత్తులో ఎట్టఎదుట మృత్యువు కన్పిస్తున్నప్పటికీ ఈ రచయిత తన సహచరులకు సముజ్వల భవిష్యత్తునే చూపుతున్నాడు. ]

## ఇరవైనాలుగు గంటలు

ఏప్రిల్ **24, 1942.** అందమైన వసంతకాలపు సాయంత్రం. చెట్లు వెచ్చటివూపిరి విడుస్తున్నాయి. ఐదునిమిషాల్లో గడియారం పదిగంటలు కొట్టడానికి సిద్ధంగావుంది.

శక్తికొద్దీ వేగంగా నడుస్తున్నా. వృద్ధునిలా నడుం వంగి నడుస్తున్నట్టు నటిస్తూ, జెలినెక్కుల కలుసుకోడానికి ఆ బంగళా వైపు ఆదుర్దాగా అడుగులేస్తూపోతున్నా. కాళ్ల సత్తువనంతా వినియోగిస్తూ ఖంగారుగా నడిచిపోతున్నా. పోవాలి. త్వరగా పోవాలి. పదిగంటలు కాకముందే అక్కడికి చేరుకోవాలి. లేకపోతే 'కర్ఫ్యూ' కటికి హస్తాలతో పీకపట్టి బైటికి నెట్టేస్తుంది. అటువైపే అడుగెయ్యడానికి ఎవరి తరం కాదు. అక్కడే నా సహచరుడు 'మిరేక్' నాకోసం ఎదురుచూస్తూ వుంటాడు. నాకు తెలుసు. ఈసారి ఒకరికొకరు చెప్పుకోవలసిన ముఖ్య విషయాలేమీలేవని నాకు పూర్తిగా తెలుసు. కాని, అక్షరాలా అనుకున్న సమావేశానికి వాయిదా వెయ్యడం ఎన్నో భయంకర పరిస్థితులకు రహదారీ వేస్తుంది. అదికాక ఆ యిద్దరి అంతరాత్మలకి, అనవసరంగా ఆవేదన కల్గించడం నాకెంతో అసహ్యమనిపించింది.

కప్పుటీతో నన్నాయిద్దరూ ఆదరంగా ఆహ్వానించారు. 'మిరేక్' అక్కడే వున్నాడు; 'షైరిడు' దంపతులు కూడా. "కామ్రేడ్స్! మిమ్మల్ని చూడ్డం నాకెంతో సంతోషం. కాని, ఈ రకంగా మీరంతా కలిసి వుండగాకాదు. ఒకే గదిలో ఇంతమందీ వుంటే, ఈక్షణంలోనే జైలుకు పోవడానికి సులభమార్గం ఏర్పడుతుంది. అనవసరంగా, అపాయాన్ని రా రమ్మని

తక్కిన కార్మిక వర్గాన్నంతటినీ, కోట్లాదిగా వున్న నిరుపేద రైతులనూ తనలో ఇముడ్చుకోలేక పోయింది. ప్రత్యేకం కళమీదా, శాస్త్ర విజ్ఞానంలోని అనుమానాస్పదమైన అనేక నూతన పరిశోధనల మీదా, ఈసంస్కృతి సంశయగ్రస్తంగా ఆగిపోయింది. లెనిన్ దృక్పథం దీనికి విరుద్ధమైనది. ఆయన దృష్టిలో సంస్కృతీ విప్లవమనేది సమగ్రమైన ఒక మహాప్రస్థానం. ఆ మహాప్రస్థానంలోనే కోటానుకోట్ల ప్రజానీకాన్నీ, దేశంలోని సాంఘిక రాజ్యాంగ వ్యవస్థలనూ సక్రమమార్గంలో పెట్టాలి, విద్యా విజ్ఞానాలు కలిగించి, శాస్త్రీయంగా పెంపొందించాలి. దీనితోపాటే అమెరికాలోను అభివృద్ధి చెందిన యూరపియన్ దేశాలలోను బాగా పెంపొందిన విజ్ఞానాన్నీ వివిధరీతులనూ పూర్తిగా నేర్చుకోవాలి. ఈ విషయాల్లో లెనిన్ దృక్పథం పరిశ్రమ చెయ్యడమంటే కేవలం పాశ్చాత్యదేశాలను పోటీచెయ్యడమనేది ఎంతమాత్రం కాదు. వర్గపోరాటపు వాస్తవం ఎట్టఎదుట కన్పిస్తున్నది. తలెత్తిన నూతన వర్గం, బూర్జువా ప్రపంచంలోని సంస్కృతీ సంప్రదాయం నుంచి, తనకు ఉపయోగకరమైన దంతా సేకరించుకొని, ధనికవాదం మీదికిదాన్నే తన ఆయుధంగా తయారు చేసుకొంటుంది.

శాస్త్రవిజ్ఞానాన్ని కొత్త పునాదుల మీద నిర్మించాలి. మానవజాతి సుఖశాంతులకు అనుగుణమైన నూతన ప్రయోజనాలకు వినియోగించాలి. కళ, స్నేహితుణ్ణీ, శత్రువునూ అర్థంచేసుకోడానికి సామ్యవాదదీక్షను ఉత్తేజింపజేస్తూ విద్యాప్రబోధం చెయ్యడానికి తోడ్పడాలి.

కమ్యూనిస్టుపార్టీ తన ముందుంచుకున్న సమస్యలు అంతర్జాతీయమైనవి. అనేక జాతులూ, భిన్న భిన్న భాషలూ కల సోవియట్ యూనియన్‌లో వీటికి చూపిన పరిష్కారం చూస్తే, లెనినిజం యొక్క జాతీయస్వభావం స్పష్టపడుతుంది. 'కమ్యూనిస్టుపార్టీ దొక్కటే సరియైన పంథా' అనేందుకు ఇదే ఋజువు. వివిధ జాతీయ సంస్కృతులు లేవని లెనిన్ ఎప్పుడూ చెప్పలేదు. రాడిషేవ్‌ను గురించి వ్రాస్తూ లెనిన్ ఏమన్నాడో చూడండి! (మిగతా 59 పేజీలో)

ఆహ్వానించుకోడమే. ఇంక నిస్సందేహంగా మృత్యువు మిమ్మల్ని వెంటాడక మానదు మీరంతా రహస్య నిబంధనలకి పూర్తిగా లొంగైనా వుండాలి లేదా మాతో సంబంధం త్రెంచుకోవాలి. మీకు మీరే మీ చేతులారా గోతులు త్రవ్వుకుంటున్నారు మీకే కాదు– ఇతర్లకికూడా. ఏం, అర్థమైందా?"

"ఆ అర్థమైంది."

"నాకేం తీసుకొచ్చావు?"

"మే డే మొదటి సంచిక. 'కూలీ హక్కులు'"

"ఎంతో బాగుంది మరి నీవో, మిర్కో–"

"కొత్త సంగతులేమీ లేవు. పని సానుకూలంగానే సాగిపోతోంది"

"సరే, మే మొదటి తారీఖు దాటిన తరువాత మళ్ళీ మరోసారి మిమ్మల్ని కలుసుకుంటా. మీకో సందేశం కూడా పంపిస్తా"

"చీఫ్! మరో కప్పు టీ ఇవ్వనా"

"అబ్బే, లేదమ్మా జెలింక్"

"ఇంకా ఇక్కడ ఎంతో మంది వున్నారు."

"దయచేసి ఇద్దూ!"

కప్పులో పడుతున్న టీ ఆవిర్ని వదులుతోంది.

తలుపు తట్టిన చప్పుడు—

ఇంత రాత్రి వేళా? ఎవరైయుంటారు? వచ్చి వాళ్ళకి ఆదుర్దా ఎక్కువౌతోంది. తలుపులు దబదబా కొట్టేస్తున్నారు.

"తలుపులు తెరవండి! పోలీసు!"

"ఉస్, త్వరగా కిటికీల్లోంచి ఊరి, పొండి, పారిపోండి. నా చేతి పిస్టల్ తో వాళ్ళని ముందుకు రాకుండా చేస్తా 'అబ్బా!' ఆలస్యమైపోతోంది. కిటికీల క్రిందనక్కి గుండెల్లేని గెస్టపో రాక్షసులు గుర్గురించు చూస్తూ గదిలోకి పిస్టల్సు గురిచేస్తున్నారు. రహస్య పోలీసులు, తలుపుల్ని బలంకొద్దీ గుంజేస్తున్నారు. తలుపులకి ఊతక లూడదీసి, వంటగదిలోంచి లోన ప్రవేశించారు. ఒకటి రెండు మూడు— మొత్తం తొమ్మిది మంది నే వాళ్ళ కంటపడలేదు కారణం? అక్కడే, వాళ్ళంతా లోన ప్రవేశించిన తలుపు ప్రక్కనే, నక్కి వున్నా ఒక్కణ్ణే అక్కడే వుండి, అమాంతంగా, ఒకేసారి, ఒకే క్షణంలో అందర్నీ అంతం చేసెయ్యగలను. కాని నిరాయుధులై, నిస్సహాయంగా, నిలువెల్లా వణుకుతూ నిలబడ్డ ఇద్దరు ఆడవాళ్ళవైపూ, ముగ్గురు మగవాళ్ళవైపూ, తొమ్మిది పిస్టల్సు గురిపెట్టబడ్డాయి. నే పిస్టల్ పేలిస్తే, ఆ తొమ్మండుగురూ మృత్యువాత పడకముందే, నావాళ్ళయిదుగురు కూలి క్రిందపడతారు. నాకు నేనే కాల్చుకుంటే, పిస్టల్ పేలిన శబ్దం అవకమానదు. నా వాళ్ళ యిదుగురూ నాతోపాటే ప్రాణాలు విడువకమానరు పిస్టల్ పేల్చకుండా, నేనక్కడే ఆ తలుపు ప్రక్కనే వడీ చప్పుడూ కాకుండా నిలబడివుంటే, నా వాళ్ళయిదుగురు ఎక్కడో, ఏ జైల్లోనో, సంవత్సరంపాటు పడివుంటారు. తరువాత విప్లవమే వాళ్ళని బైటకి తీసుకొస్తుంది. కాని, నేనూ, మిరేక్ మాత్రం ప్రాణాలతో బైటపడ్డం అసంభవం కలలో మాట. మమ్మల్ని నానా హింసలు పెట్టేస్తారు. చిత్రవధ చేసేస్తారు. వాళ్ళేం చేసినా, ఎన్ని తిప్పలు పెట్టినా, నన్నెంత నిర్బంధించినా నా వద్దమాత్రం ఏ

గుట్టూ కనిపెట్టలేరు. ఏ సంగతీ తెలుసుకోలేరు. కాని, మిరేక్ ఏం చేస్తాడో! స్పెయిన్ అంతర్యుద్ధంలో అసమానశౌర్యముతో పోరాడిన వ్యక్తి, ఫ్రాన్సులో రెండు సంవత్సరాల పాటు కాన్సెంట్రేషన్ క్యాంపులో, ఎన్నో ఎన్నెన్నో క్రూరహింసలకు తలవొగ్గిన వ్యక్తి, అక్కణ్ణుంచి శత్రువు కంటపడకుండా, రహస్యంగా, అష్టకష్టాలుపడి, 'ప్రేగు'కి పారిపోయివచ్చిన వ్యక్తి! చెప్తాడా? మా రహస్యం చెప్తాడా? చెప్పడు ఎన్నటికీ ఏ రహస్యం చెప్పడు ఏదో ఒకటి తేల్చేసుకోవాలి. ఈ క్లిష్టపరిస్థితి గాటి, బైటికి పోడానికి దారి చూసుకోవాలి. రెండు సెకండ్లో, మూడు సెకండ్లో మా త్రమే వ్యవధివుంది.

ఇంతకీ నే పిస్టలు పేల్చి నావరకు కష్టాల నుంచి నేను తప్పించుకున్నా, ఎవర్నీ ఏ విధంగానూ రక్షించలేను. కాని, నల్గురు కామ్రేడ్సు జీవితాలు బలి అయిపోతాయి. అంతేకదా!

విషయం పరిష్కారమై పోయింది. తలుపుసందునుండి బైటికొచ్చా.

"అరే, ఇంకో డున్నాడే!"

ముఖంమీద మొదటి దెబ్బ. చాలు, అదొక్కటీచాలు—మనిషిప్రాణం తీసెయ్యడానికి

"చేతు లెత్తు"

మరోదెబ్బ, మరొకటి.

సరిగ్గా, నేనునున్నట్టే.

కుర్చీలన్నీ, అటూయిటూ చెదరిపడి, గది చిందరవందరగా తయారైంది.

తన్నులు, తాపులు.

" ఊ! నడూ"

నన్నీడ్చుకుంటూ, లాక్కుపోయి, లారీలో పడేశారు. పిస్టల్ నా గుండెకు గురిపెట్టి, వేధించడం మొదలెట్టారు.

" ఎవరు నువ్వు ?"

"ప్రొఫెసర్ హోరక్"

"అబద్ధం"

ఎందుకో నా చేతులు కదిలాయి.

"కిక్కురు మనకుండా కూర్చో. కాల్చి పారేస్తాం"

"సరే కాల్చండి"

కాల్చలేదు. ముఖంమీద పిడికిళ్ళతో పొడిచారు.

ప్రక్కనుంచే కారొకటి పోతోంది. తెల్లటి రంగు పూసుకున్నట్టు కనపడింది. వెళ్ళి కారు—రాత్రి వేళా! జ్వరంలో వొళ్లంతా ఒక్కసారి, భగ్గున మండి నట్టయింది.

పెఛెక్ భవనం. అదే గెస్టాపో ఉన్నత కార్యాలయం. ప్రాణాలతో ప్రవేశిస్తాననుకోలేదు. నాల్గో అంతస్తుదాకా పరుగెత్తించారు. ఓ అదే పేరుగాంచిన 2-ఎ. సెక్షను, నాజీ గూఢ చారులకు కీలక స్థానం. నాగుండెలో ఆందోళన బైల్దేరింది.

సన్నగా పొడుగ్గా వున్నాడు ఖైదీలని కాల్చుకుతినే అధికారి. జేబులో పిస్టల్ పట్టుకుని, ఆ కమిసార్ నన్నాతని గదిలోనికి లాక్కుపోయాడు. నాసిగరెట్ కి నిప్పు ముట్టించాడు.

" ఎవరునువ్వు "

" ప్రొఫెసర్ హోరక్"

" అబద్ధం "

అతని మణికట్టు మీద గడియారం పదకొండు గంటలైందని చెప్తోంది.

" వెతకండి "

నన్ను క్రిందపడేసి వెతకడం మొదలెట్టారు.

"ఇదిగో, అయిడెంటిటీ కార్డు!"

"పేరు!"

"ప్రొఫెసర్ హేరక్"

"సరే జాగ్రత్త పెట్టండి."

వాళ్లు ఫోనులో ఏదో మాట్లాడారు.

"ఈ కార్డు రిజిష్టరయిందికాదు. దొంగతనంగా కల్పించి వుంటాడు."

"నీకి దెవరిచ్చారు ?"

"పోలీసు అధికార్లు"

కమ్చీతో కొట్టడం మొదలెట్టారు. ఒకటి, రెండు ...... ఎన్నని లెక్కించగలను. ఎవరికి చెప్పుకోను ?.

"నీ పేరు ? చెప్పు. నీ వుండేచోటు ? చెప్పు. మొద్దల్లే మాట్లాడవేం ? నీకింకా ఎవరెవరితో సంబంధాలున్నాయి? వాళ్లెక్కడుంటున్నారు? చెప్పు. చెప్పు. చెప్పు. చెప్తావా. చెప్పవా. చావబాదేస్తాం."

మనిషి ఎన్ని దెబ్బలకని తట్టుకోగలడు?

అర్ధరాత్రి రేడియో మెల్లిగా మూల్గుతోంది. హోటళ్లు మూసేస్తూవుంటారు. అంతవరకూ అక్కడా, ఇక్కడా తిరిగిన జనం ఇళ్ళకు జేరుకుంటూ వుంటారు. ప్రేమికులు, ఇళ్ళ గుమ్మాలయెదుట నిలబడి, ఒకరినొకరు విడిచిపోలేక, బాధపడుతూ వుంటారు. ఆ సన్నగా పొడుగాటి కమీసార్ నాగదిలోకి ప్రవేశించాడు.

"సంపాదకుడా ! అన్నింటికీ సిద్ధంగా వున్నావా ?"

ఈమాట వీడికెవరు చెప్పివుంటారు. జెలినెర్సులా - ఫ్రీడుస్లా. వాళ్ళకి నా పేరైనా తెలియదే !

"ఇదిగో ! చూశావూ! నీ సంగతంతా తెలిసిందిలే ! న్యాయంగా వున్నదున్నట్టు నిజం చెప్పేసెయ్."

వాళ్ళ ప్రత్యేక భాషలో నిజం అన్నమాటకి అర్థం అబద్ధమని. అలాంటి నిజం నా కక్కరలేదు.

"ఏయ్. వాణ్ణి కాళ్లు చేతులు కట్టేసి, చచ్చేలా చితక్కొట్టేసెయ్యండి."

ఒంటిగంట. ఖాళీగావున్న వీధుల్లో చివరికార్లు పరుగెత్తుతున్నాయి. అంతవరకు కష్టపడి, ఓపికతో తనమాటలు, పాటలు, విన్నవాళ్లందరికీ రేడియో 'గుడ్ నైట్' చెప్పేసింది.

"ఇంకా మీ సెంట్రల్ కమిటీ సభ్యులెవరు ? మీ వార్తాహరు లెక్కడున్నారు ? మీ ప్రెస్ ఎక్కడుంది ? చెప్పు. చెప్పు!"

ఇప్పుడు నా వొంటిమీద వాతలై కనపడే దెబ్బలన్నీ లెక్కించగలను. ఇప్పుడు నే పడేబాధ పెదవులు కొరుక్కోడం ఒక్కటే.

"వీడి బూట్లు తీసెయ్యండి"

ఇంతవరకూ బూట్లు లేకుండా, వొట్టి కాళ్ళమీద, దెబ్బలు తగలలేదు. ఇప్పుడు తెలుస్తోంది ఆబాధ! ఐదు, ఆరు, ఏడు_ ప్రతీదెబ్బ, ప్రతీసాగ సూటిగా మెదడుకి తగులుతోంది

రెండు గంటలు. 'ప్రేగ్' నిద్రపోతోంది. ఎక్కడో ఒక పసిపాప ఏడుస్తూ వుంటాడు. ఎక్కడో ఒకడు తన ప్రియురాలిని బుజ్జగిస్తూవుంటాడు.

"చెప్పు, చెప్పు"

నా నోట్లోంచి, నెత్తురు కారుతుంటే నాలుక రాలిన పళ్ళని లెక్కపెడుతోంది. ఎంతసేపూ లెక్క పన్నెండు, పదిహేను పదిహేడు...కాదు, కాదు ఆ లెక్క నాదికాదు. కమీసార్ లెక్కిస్తున్నాడు. పాపం, నన్ను కొట్టి, కొట్టి, ఆఖరికి వాళ్ళంతా అలసిపోయారు. కాని మృత్యువింకా నాసమీపానికి రాడంలేదు.

మూడు గంటలు. బైట పరిసరాల్లో ఉషఃకిరణాలు కదులుతున్నాయి. రైతులు, బళ్ళమీద సరుకు తీసుకుని, సంతకిపోతున్నారు. వీధి తుడిచేవాళ్ళు అప్పుడప్పుడే యిళ్ళనుండి బైల్దేరుతున్నారు. బహుశా, మరో సూర్యోదయం వరకే నేబ్రతికి వుంటానేమో ?

నా భార్యని తీసుకొచ్చారు

"నువ్వితన్ని ఎరుగుదువా ?"

నా నోటిచుట్టూ, ఎర్రగా మెరుస్తున్న రక్తాన్ని ఆమె కళ్ళపడకుండా లోపలికి పీలుస్తున్నా... కాని, అది శుద్ధ తెలివి తక్కువ. నాముఖంమీద, ప్రతీ అంగుళం, రక్తాన్ని చిమ్ముతూనేవుంది ఆఖరికి, వ్రేలికొసలుకూడా రక్తంతో ఎర్రగా, కందిపోయాయి.

"నువ్వితన్ని ఎరుగుదువా ?"

"ఊహు ! నే నెరుగను."

నదురు బెదురు లేకుండా, నిర్భయంగా అనేసింది. స్వచ్ఛమైన బంగారంలాంటి స్త్రీ. మా ప్రతిజ్ఞ నిలబెట్టింది. నన్నెప్పుడూ గుర్తించనని, అన్నమాట అక్షరాలా అమల్లోపెట్టింది. ఆ విషయం ఇప్పుడు పూర్తిగా అనవసరం. ఐతే నా పేరెవరు చెప్పివుంటారో ?

ఆమెను లాక్కుపోయారు. వీలైనంత వరకు, నా చూపుల్లో ఉత్సాహం ఉట్టిపడేలా, ప్రయత్నిస్తూ ఆమెవద్ద శలవు తీసుకున్నా. కాని, నాచూపుల్లో ఆనందం అసలేలేదని నాకు తెలుసు ఉత్సాహం మచ్చుకైనా లేదని నాకు తెలుసు

నాల్గుగంటలు. తెల్లవారుతోందా ? లేదా ? చీకటి కిటికీలు నోరెత్తనేలేదు నాకు సమాధాన మివ్వనేలేదు. మృత్యువు మెల్లిగా, మెలిమెల్లిగా, అడుగులో అడుగేసుకుంటూ, నన్ను, వెతుక్కుంటూ నావైపే వస్తోంది. మృత్యువును మనసారా ముద్దెట్టుకోనా ? కులుకుతూ కౌగిలించుకోనా ? ఎల్లాగ ? ఏవిధంగా ?

ఎవళ్లో వెనకాల వీపుమీద చరిచారు. నేలమీద బోర్లాపడ్డా. బూటుకాళ్ళతో వెన్ను విరగద్రొక్కేస్తున్నారు. అదీ–నా అంతం అట్టే దూరంలోలేదు. ఆఖరి ఘడియ సమీపిస్తోంది. నల్లటి కొరకంచులా కొరకొరలాడుతూ చూస్తూ ఆ కమిసార్ నా గడ్డాన్ని గుంజి, బిగలాగుతూ నన్ను పైకెత్తి నిలబెట్టి, తెగిన వెంట్రుకల్ని చూపిస్తూ, పిశాచంలా వికటాట్టహాసం చేస్తున్నాడు.

నాలో నెత్తురంతా, నసాళాని కెక్కుతోంది. తర్వాత మళ్ళీ, మరోసారి, బాధపడే అవసరం ఉండదేమో ?

ఐదుగంటలు—ఆరు—ఏడు— పది. మధ్యాహ్నం సూర్యుడు, నింగి నడినెత్తిమీది కెక్కబోతున్నాడు. కూలీలు, చెమటోడుస్తూ పనిచేస్తున్నారు. పిల్లలు బడిలో వున్నారు. సంతకుపోయి, సరుకులు కొనుక్కుని, ఇళ్ళకి పోతున్నారు ప్రజలు.

బహుశా, నాతల్లి, ఇప్పుడే నామాట తలుచుకుంటూ వుంటుంది. నా కార్యమే దస్నందరికి, నా పరిస్థితి, తెలిసిపోయే వుంటుంది. ఈపాటికి, ఎక్కడో ఏ రహస్యస్థలాల్లోకో పోయి దాక్కునే వుంటారు......

మా గుట్టుకి ముసుగు తీసేస్తే! ఉన్న విషయాన్ని ఉన్నదున్నట్టు చెప్పేస్తే! ఏమౌతుంది! అబ్బో! చెప్పను. ఏ రహస్యం చెప్పను. సోదరా! నిజం. నామీద నమ్మకం ఉంచుకో! ఇంతకీ నా అంతం చేయవలసేవుంది. ఇదొక పీడకల పెదవులెత్తి పలుకలేని పీడకల వొంటినిండా వడగళ్ళవానలా పడుతున్నాయి దెబ్బలు...తిరిగి బ్రతికించి బాధలు పెట్టేందుకు నోట్లో నీళ్లు పోస్తున్నారు.

మళ్ళీ తన్నులు, దెబ్బలు; నవ్వులు, కేరింతలు. "చెప్పు. చెప్పు, చెప్పు." అంత జేసినా, మృత్యువు నా దరికిరాడంలేదు అమ్మా, నాకెందుకింత శక్తినిచ్చావు తల్లీ! యీ చిత్రవధల నెదుర్కునే గుండెబల మెందుకు ప్రసాదించావు తల్లీ!

సాయంత్రం. ఐదుగంటలు. నన్ను కొట్టి, కొట్టి, వాళ్ళంతా చితకపాడిచేసి హూనం చేసేసి, వాళ్ళంతా అలిసిపోయారు వొంటిమీద దెబ్బలు ఆగిఆగి పడుతున్నాయి. మళ్ళీ నా ముఖంమీద జీవకళ మొదలసాగింది. అంతలో, అకస్మాత్తుగా, ఎక్కడో, ఏప్రదేశంలోనో దృష్టి కందని దూరతీరాలమీదుగా, శాంతస్వర మొకటి, మెల్లిగా, జాలిగా, గాలిపై సాగిపోతోంది.

"తగినశాస్తి జరిగింది."

కాళ్లు విరిగి, ముందుకి వెళ్ళి, ఊగుతున్న బల్లమీద కూర్చున్నతర్వాత ఒకడొచ్చి నాకు నీళ్ళందించాడు. మరొకడొచ్చి సిగరెట్ యిచ్చాడు. అయ్యో! ఏమైందినా శక్తి. ఇచ్చిన సిగరెట్, ఎత్తి పెదవులపై పెట్టలేకపోయానే! ఎవడో మరొకడొచ్చి, నాకాళ్ళకుబూట్లుతొడగబోయి, మళ్ళీ, ఎందుకో ఏ కారణం చేతనో, చేతకాక, చేతులు దులుపుకుంటూ లేచిపోయాడు వాళ్ళంతా కలిసి నన్ను సగం యీడుస్తూ, సగంమోస్తూ, లాక్కుపోయి లారీలో పడేశారు. లారీ పరుగెత్తిపోతున్నంతసేపూ, ఒకడు మాత్రం, మహాశ్రద్ధగా, పిస్టల్ నాగుండెకు గురిపెట్టి చూపిస్తూనే వున్నాడు వాడికున్న గ్రుడ్డి రాజభక్తిని చూసి, నాలో నేను నవ్వుకున్నా తెల్లటి పూలతో అలంకరింపబడిన కారొకటి లారీ ప్రక్కనుంచే పోయింది. పెళ్ళికారు—బహుశా అదంతా కలేమో? అవును. కలయే! లేక మృత్యువు పెదవుల్లోకి దిగిపోతున్నానేమో! అట్టడుగున అగడ్తలలోకి దించుకుపోతున్నానేమో! కాని మృత్యువు మాటలతో రాదు. ఇదేంతో సులభం. ఎక్కడో, ఏ కొండకడపటి కోణంమీద నుంచో క్రిందికి దొర్లిపోయినట్టే. ఒకటే ఒక ఉచ్ఛ్వాసనిశ్వాసంలో, ఉన్న బాధనంతా, పైపై కెగజిమ్మేయగలం

అంతా అయిపోయింది. కాదు కాదు. అప్పుడేనా! నేనిప్పుడు, ఒక్కణ్ణే, ఒంటరిగా నిలుచున్నా వెనకెవరూ ఆసరా లేకుండా నాకాళ్ళమీదే నిలబడ్డా. నా కెదురుగా నీలిగోడ......నిండా ఎర్రటి

మరకలు. ఏమిటవి ? రక్తం......నర రక్తం......అల్లాగే ఎర్రగా మెరుస్తున్నాయి. వణుకుతున్న వేళ్ళతో స్పర్శించాను....నిజం .. రక్తం ... పరిశుద్ధమైన వేడిరక్తం...నాదే ఆరక్తం... నా నరాల్లోదే ఆరక్తం.

ఎవడో నా నెత్తిమీద పిడికిలితో పొడిచాడు చేతులెత్తి, మోకాళ్ళమీద వంగి క్రిందకి, పైకి, గుంజీళ్లు తియ్యమన్నాడు. క్రిందకి పైకి, పైకి క్రిందకి మూడోసారి ముఖంతిరిగి నేలమీద పడిపోయాను

హృదయంలేని నాజీరాక్షసు డొకడు నాగుండెమీద నిలబడి, కాళ్ళతో తన్నుతూ, లేవమన్నాడు. మళ్లొకడొచ్చి ముఖంమీద నీళ్లుచల్లాడు. నన్ను ఆప్రక్కనే బల్లమీద కూర్చోపెట్టారు. ఒక స్త్రీ వచ్చి నాకు మందుపోసింది. బాధఎక్కడ ఎక్కువగా వుందో అడిగింది "బాపంతా నా హృదయంలోనే వుం"దన్నాను.

"నీకు హృదయం లే" దన్నాడు నాజీ వాడు.

"నాకా, నాకు హృదయం వుంది" అన్నాను ఇంకా నాకు నిలబడే శక్తివుండడం చూసి, అకస్మాత్తుగా ఎంత గర్వపడ్డాను!

అంతలో అక్కణ్ణుంచి అన్నీ మాయమైపోయాయి — ఆ నీలిగోడ, నాజీవాడు, ఆ స్త్రీ, అందరూ అందరూ ఆక్షణంలో అంతర్థానమైపోయారు.

నాకెదురుగా జైలు తలుపులు కిర్రుమంటూ తెరుచుకున్నాయి. ఒక నాజీ వాడు నన్ను రెక్కపట్టి లోపలికి నెట్టేశాడు. చొక్కాపట్టి గుంజి, నేలమీద బోర్లాపడేశాడు. తన్నులతో, తాపులతో కమికి ముద్దయిపోయిన నా శరీరాన్ని ఉక్కుచేతులతో గట్టిగా నొక్కి, అటూ ఇటూ దొర్లించాడు.

"ఇదిగో! జాగ్రత్తగా కనిపెట్టివుండు, వీడేంచేస్తూ వుంటాడో" రెండోవాడితో చెప్పిపోయాడు.

మళ్లీ అచేరకంగా ఎక్కడో, ఏ ప్రదేశంలోనో, దృష్టికందని దూరతీరాల మీదుగా, శాంతస్వర మొకటి మెల్లిగా, జాలిగా గాలిపై సాగిపోతోంది.

"తెల్లవారేటప్పటికి వీడి కంఠంలో ప్రాణం వుండదులే"

ఐదు నిమిషాల్లో గడియారం పది గంటలు కొట్టడానికి సిద్ధంగా వుంది. అందమైన వసంతకాలపు సాయంత్రం చెట్లు వెచ్చటి వూపిరి విడుస్తున్నాయి.

★

"సలసలక్రాగే చమురా కాదిది
ఉష్ణరక్తకాసారం;
శివసముద్రమూ నయాగరావలె
ఉరకండీ! ఉరకండీ! ముందుకు—"

—శ్రీ శ్రీ

# స్వతంత్ర భారతం

శ్రీ ధనకుధరం వెంకటాచార్య

ప్రతిరక్తాణువు దేశభక్తి పరిపూర్ణంబై ప్రబోధింప జీ
విత సర్వస్వము మాతృభూమికిని నైవేద్యమ్ముగావించి - అ
ప్రతిమానమ్మగు వీర భారత చరిత్రన్ నూతనాధ్యాయ మం
కితమున్ జేసిన త్యాగమూర్తుల మహాకీర్తిన్ ప్రశంసించెదన్

అరువదివత్సరాలకృషి యంతయు నేడు ఫలించె, ఆకస
మ్మరుణిమదాల్చె - తూర్పు దెసయం దుదయించె స్వతంత్రభానుఁ
వరకు గలట్టి చీకటులపాలిటికిన్ యముడై - దిశావళుల్
తిరిగి ప్రతిధ్వనించినవి తీయనికంఠముతోడ స్వేచ్ఛగా-

మూగ తనమ్ముదాల్చినది మొన్నటిదాక మదీయకంఠమే
రాగముతీయ నెంచినను రాదుగదా ఒకశబ్దమేని - నే
డాగక పొంగివచ్చు భవదద్భుతగాధసుధాస్రవంతిగా
మూగనుగాను నే నిపు డమోఘపికస్వరగాయకాగ్రణిన్

మరణపు లెక్కలందు నను మాత్రము వ్రాయగలేదు గాని, న
న్నెరుగనికారణాన; నిజమెప్పుడొ నే మరణించి నాడ దు
ర్భరపరివేదనాగ్ని శలభమ్మయి - నేడుస్వతంత్రభూమిలో
మరలజనించినాడ - అనుమానము లేదమరుండ నేనికన్

నాదుస్వతంత్రభారతమునన్ కనరాదిక ముందు; అన్నపా
నాదులకున్ తపించెడి క్షుధార్తులు - బీదలు భాగ్యవంతులన్
భేదములుండరాదు - వినిపింపగరాదు చరిత్రలో మతో
న్మాదపు యుద్ధ ఘట్టముల మారణహోమ కథావిధానముల్

# 'కొత్తగడ్డ' సమీక్ష

శ్రీ సెట్టి ఈశ్వరరావు

**కొత్తగడ్డ**

(పదహారు నాటికల సంపుటం)

రచయిత : శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

వెల . పది రూపాయలు

ప్రతులకు . రచయిత పేరిట

4 పై క్రాఫ్ట్స్ స్ట్రీట్,

రాయపేట, మద్రాసుకు వ్రాయాలి

సంవత్సరం పొడుగునా రెక్కలు విరుచుకొని పనిచేసినా, తనువుగడవనిది రైతు విత్తం. పైగా తలమోపెడుగా అప్పులు. అవసరం కనిపెట్టి, పంటను తక్కువ ధరకు కొట్టేస్తాడు కమిషన్ బేరగాడు. కాస్తా ఆగితే ధర పెరుగుతుందనీ, పేటకు తోలుకపోవడానికి వ్యవధి వుంటే, రెండుమూడణాలు యెక్కువ ధర వస్తుందనీ నమ్మకమున్నప్పటికీ, తక్కువధరకే పంట నమ్ముకోక తప్పదు. వూటల్లో కిస్తీ కట్టకపోతే, గొడ్లను జప్తుచెయ్యిస్తానని మునసబు బెదిరిస్తున్నాడు. పైగా సెస్సులనీ, జమాబందీ మామూళ్లనీ, యింకొంత గుంజుతారు. మాగుకాన్లు తక్కువచేసి అడిగిన ఊళ్లో పావుకారు, తనకమ్మలేదని రైతు మీద పగబడతాడు. తనకు "ఏ పనొచ్చినా హాజరుగా నిలబడ్డాడన్న విశ్వాస "మైనా లేకండా యేయేటి కాయేడు వడ్డీ పుచ్చుకుంటున్నా, తన నోటు చెల్లించకపోతే "పద్నాలుగు కోర్టులు తిప్పి, నీ అంతు కనుక్కుంటా"నని ప్రతిజ్ఞ చేస్తాడు. ఇంతకంతచేసి, దొంగ లెక్కలు రాసిన కిరాణ ఖాతావాడు "దమ్మిడీలతో సహా గోళ్లూడగొట్టి" పుచ్చుకుంటాడు.

"తల తాకట్టుపెట్టయినా" యీ బాకీలన్నీ తీర్చాలిసిందే. వైపంటనాటికి నల్లపూసలగొలుసు చేయించి పెడతానని ఆశపెట్టిన యీ రైతు, యీ యేడు కూతురు ముద్దు చెల్లించడానికి ఒప్పుకుంటాడు. కూతురు, గొలుసుకు 'మోస్తరు' కూడా తెస్తుంది. కాని తాను గొలుసు చెయ్యించలేకపోవడమే కాకుండా, పిల్లదాని గాజులు కుదువపెట్టి, దానిని "మొండి చేతులతో నిలబెట్ట"వలసి వస్తుంది. పంట మీద ఆశపెట్టుకొని చీరలు కొనమన్న భార్య అవసరమూ తీరదు. "ఇఖ అతుకు పెట్టుకుందామన్నా ఆగేలాగ లేని" చిరుగు చీరలతోనే గడుపుకోవలసి వస్తుంది. "కంచరలింగయ్యొచ్చి నడీదిలో దేరా" వేస్తే, సరదాపడి ఎడ్లకోసం మువ్వలు తెచ్చుకున్న కొడుకు, యీ యేడు డబ్బు యిచ్చే ఆశలేక, కంచరలింగయ్య వైపంట దాకా 'నిలవడు,' తిరిగి మువ్వలు వాపసివ్వవలసి వస్తుంది. రోజు కొక కానీ పొగాకుముక్కకుకూడా గడుపుకోలేక, "ఇఖ చుట్ట ముట్ట"ననే నిర్ణయం చేసుకోవలసివస్తుంది రైతు.

అందరూ మైపంటమీాదే ఆశ పెట్టుకుంటారు. కాని అతని భార్య అన్నట్టు, "మైపంట... మైపంట... మైపంట ఎక్కడి మైపంట? కళ్ళన్నీ దానిమీాద పెట్టుకోవడమే గాని, అది నోటిదాకా వస్తేనా? కాటకలు, గద్దలు తన్నుకుపోయినట్టు చేతిలోదాన్ని చేతిలోనే తన్నుకుపోతారయ్యో! పండించేవరకే పంటమనది."

గోడమీాదరాసిన రేపులాగ ప్రయోజనం లేకపోయినా, మళ్ళీ తమ అవసరాలన్నిటికీ మైపంటమీాదనే ఆశపెట్టుకొని వాయిదా వేసుకుంటారు!

మైవిషయం—రచయిత అన్నట్టుగా 'జీవితఖండం'—నార్ల వెంకటేశ్వరరావుగారి 'మైపంట' అనే ఏకాంకిక (ఏకరంగ) నాటికలోనిది. "కొత్త గడ్డ" అన్న పేరుతో ఆయన ప్రచురించిన పదహారు నాటికల సంపుటంలో, 'మైపంట' మొదటిది. ఈ సంపుటంలో యిది ముఖ్యమైనగకూడా. 'మైపంట' తెలుగుసాహిత్యక్షేత్రంలోనే చాలా నిండైన పంట

మొత్తంమీాద చూస్తే, నాటికలన్నీ కూడా విషయంలోనూ, శిల్పంలోనూ చాలా వుత్తమస్థాయికి చెందినవి.

ఈ సంపుటంలోని 16 నాటికల్లోనూ మైపంట, ప్రారబ్ధం, శకునపక్షి, కొత్తగడ్డ, వెలుగునీడలు, ఏకాభిప్రాయం, భంగిపాటు (ఇందులో బస్తీవ్యక్తికూడా వస్తాడు) వంటెన అన్న ఎనిమిదినాటికలూ గ్రామజీవితాన్ని చిత్రించినవి గ్రామజీవితాన్ని చిత్రించడంలో—భాషలోనూ సన్నివేశాలు, వాతావరణం కల్పించడంలోనూ—నార్లవారు అపూర్వమైన సామర్థ్యాన్ని ప్రదర్శించారు. ఎంతో అనుభవం అంతేకాకుండా నిశితమైన పరిశీలనకూడా ద్యోతకమవుతుంది వీటిలో. మన గ్రామజీవితానికి సంబంధించినంతవరకూ, తెలుగుసాహిత్యంలో యింతచక్కని నుడికారం ఒక్క "ముందడుగు" (నాటకం) లోనూ "ఐక్యత"(నాటిక) మాత్రమే కనిపిస్తోంది.

తను చేసిన అవకతవకలకూ, జీవితంలోని ఒడుదుడుకులకూ, 'ప్రారబ్ధం' అని సమాధానం చెప్పుకుని, కొంపమీాదికి తెచ్చుకునే మూర్ఖుడి జీవితం—"ప్రారబ్ధం." కూతుర్ని, పరమ దౌర్భాగ్యుడని తెలిసుండి కూడా మేనల్లుడికిచ్చి పెళ్ళిచేసి, అందువల్ల వచ్చిన దుష్ఫలితాలన్నిటినీ ప్రారబ్ధమని మెట్టవేదాంతంతో అనుభవిస్తాడు. కూతురికి తీవ్రమైన వ్యాధివస్తే సరియైన వైద్యం చేయించక ఆమె మరణానికి కారణమైకూడా, ప్రారబ్ధమని సమాధానపడతాడు.

"శకునపక్షి" అన్న నాటికలో, సీతాపతి సామెతలు బెడిసిగొట్టి, అవతలవాళ్లు తనకు ఉచితంగా యిస్తామన్నవన్నీ పోగొట్టుకుంటాడు. అర్ధచంద్రప్రహారం మినహాగా, వారి యింటినుండి బయటపడతాడు.

"కొత్తగడ్డ"లో, కాలజ్ఞేపానికేసరిగా చాలని పొలంతో తంటాలుపడే పూర్వకాలపుతండ్రి, పొరుగూరికిపోతే సుఖంగా బ్రతకవచ్చని కొడుకు నచ్చజెప్పినా వినడు. పైగా— కొడుకుని తూలనాడతాడు. వేరుపడడానికి కూడా సిద్ధపడతాడు. కాని— "ఈ గడ్డమీాదే పుట్టాను; ఇక్కడే పెరిగాను; ఇక్కడే మట్టికూడా అయిపోదా

మనుకున్నా"— అన్న పూర్వభావాన్ని, భల్లూకపుపట్టునూ వదిలి, మనవడి భవిష్యత్తుకోసం "కొత్తగడ్డ"కు పోవడానికి అంగీకరిస్తాడు.

ఈ భావపరివర్తనను చిత్రించడంలో, తొందరపాటుతనం కనిపిస్తోంది. అందువల్ల సహజత్వం లోపించి, అంతవరకూ లీనమై చదివే పాఠకుడికి (ప్రేక్షకుడికిగాని) హఠాత్తుగా అవాస్తవికత పట్టినట్లు వుంటుంది. ముసలాయనలో యింత అకస్మాత్తుగా పరివర్తన కలిగించడానికి బదులు, (యీ పరివర్తనకు సంబంధించిన భాగం ప్రదర్శించేటప్పుడైనా, ఒకటి రెండు నిమిషాలకు ఎక్కువ పట్టదు.) రచయిత ఇంకో మార్గం అవలంబిస్తే, రచనకు యెంతో [illegible]దు వచ్చివుండేది.

ఇదే విధంగా 'వెలుగునీడ'ల్లో చీటికీ మాటికీ ఒకరిపైనొకరు విసుగూ, కోపమూ తెచ్చుకునే రైతు- అతని తల్లీ, భార్యా, కొడుకూ పాలు పితుకుతుండగా, రైతుకు ఆవుతన్ని మోపైన దెబ్బ తగిలేసరికి, యీ విసుగులూ, కోపాలు అన్నీ మర్చిపోయి, పరస్పరం యెంతో అభిమానించుకుంటారు. తమ పూర్వాపూర్వ ప్రవర్తనకు విచారిస్తారు. ఇది కష్టాలు వచ్చినప్పుడు— జీవితంలో సహజమే కాని- చిత్రణలో అసహజత్వం కనిపిస్తోంది. ఇదికూడా రచయిత తొందరపాటుతనంవల్లనే జరిగిందని చెప్పవచ్చు. ఈ నాటికలోని ముసలమ్మ గొణుగుడు, సరిగ్గా అచ్చుగుద్దినంత సహజంగా ఉంది

"ఏకాభిప్రాయం"లో, పల్లెటూరి పొలిటీషియన్ల సంభాషణలో వ్యక్తపరిచే ఒకే భావాన్ని అనేక తిరుగుళ్లుగా పదేపదే చెప్పించడంవల్ల, హాస్యప్రయోజనం నెరవేరవచ్చుగాని, వాస్తవికతమాత్రం కుంటుపడింది. ఎదిరి పార్టీమనిషిని రానివ్వకూడదన్న మాటమీద ఒకచోట యీ క్రింది విధంగా సంభాషణ సాగుతుంది.

"అడుగు పెడితే బడితపూజే"

"బ్రహ్మ రామకీర్తన పాడిందన్న మాటే"

అటువైపు తొంగైనా చూస్తే, రక్తం కళ్ళచూడం !"

"అక్కడే పాతిపెట్టం"

"అక్కడే గోరీకట్టం"

"ఎవడికి కలేజావుంది అక్కడికి రావడానికీ !"

"ఎన్ని గుండెలుండాలి అక్కడడుగెట్టడానికి !"

"ఇంటిదగ్గర చెప్పుకురావాలి"

ఇదేవరస. తక్కిన నాటికల్లోకూడా యీ లోపం కొద్దిగా కనిపించకపోలేదు. ఇది' చేతిలో వున్న మాటల ప్రదర్శన కోసమాఅని అనిపిస్తుంది. వ్యంగ్యంకోసం కూడా యింతగా సాగతీస్తే, విశ్వనాథ కవిరాజుగారి నాటికల్లోలాగ, బలవంతంగా నవ్వించడానికి మాత్రం పనికి వస్తుంది. కాని వాస్తవికత కుంటుపడక తప్పదు.

దర్పంకోసరం ఉద్యోగం వూడినా వుందని అబద్ధమాడి, చివరికి పల్లెటూరి మామగారిచేతిలో భంగపడిన బస్తీ యువకుని పరాభవం—"భంగపాటు"

"వంతెన"—గ్రామానికి వంతెన, రోడ్డు, బస్సులువచ్చి, బస్తీతో సంబంధం యేర్పడడంవల్ల, గ్రామస్థులు పెరుగు, నెయ్యి,

'పాలు మొదలైన వస్తువులు బస్తీలో అమ్మి
నాలుగు డబ్బులు చేసుకుని బాగుపడ
తారు. పూర్వంలాగ గ్రామంలో వస్తు
వులు ధారాళంగా దొరకవు. కొందరికి
బస్తీ నాగరికతలోని కొన్ని చెడులక్ష
ణాలు కూడా అలవాటవుతాయి. ఈ
రవాణా సౌకర్యాలవల్ల బాగుపడినవారు
కూడా, కూపస్థ మండూకస్థితిని
పోగొట్టి, యివి విశాల ప్రపంచాన్ని అందు
బాటులోనికి తెచ్చిందని గ్రహించలేక,
"యీ మండిన వంతెన కట్టించి, ఈ మాయ
దారి రోడ్డు పోయించి, యీ ముదనష్టపు
బస్సులు తెప్పించి" అని వాటిని నిందిం
చడం చమత్కారంగా చిత్రించబడింది.
సంభాషణలకు వెనక, కొత్తనాగరికతకూ
పాతనాగరికతకూ మధ్య జరుగుతూన్న
సంఘర్షణ చక్కగా చూపబడింది.

దాంపత్యం, నవకవి, ఇంటిగుట్టు,
ద్రోహం, ఆడబ్రతుకు, దొంగ: దొర,
అర్ధాంగి, జీవజ్వాల అన్నవి బస్తీజీవితాన్ని
చిత్రించే నాటికలు. గ్రామజీవితంలో
చెయితిరిగినంతగా వీటిలో రచయిత
నైపుణ్యం కనిపించలేదనే చెప్పాలి.
గ్రామజీవితం కళ్ళకు కట్టినట్టు చూపగలి
గిన రచయిత వీటిలో అంతగా కృతకృ
త్యుడు కాలేదనిపిస్తుంది 'పైపంట' మొద
లైన వాటితో సరిపోల్చిచూస్తే, బస్తీ
వాతావరణం అంత గొప్పగా కనిపించదు.

జీవితంనుండి పలాయనం చిత్తగించిన
'నవకవి' గురించి వ్రాసిన "నవకవి" యీ
సంపుటంలో లేకండా వుంటేనే బాగుం
డేది. 'నవకవి' యిప్పుడు, యిందులో
చూపినంతగా ఒళ్లు మరచిలేడు. ఇష్టం
వుండో లేకనో, 'కళకోసం కళ' అన్న
మతాన్ని ఒదులుకున్నాడు. పలాయ
సాహిత్యం పట్ల విముఖత కనబరుస్తు
న్నాడు. అప్పుడుకూడా—అంటే భా
కవిత్వపు రోజుల్లోకూడా—ఇంత హృదయ
రహితంగా, 'అమానుషంగా' లేడు.
సహాయం చేయకపోయినా, దుస్థితిలో
వున్న వారిపట్ల కనీసం సానుభూతికూడా
లేనివాడిగా మానవత్వమే మర్చిపోయి
వాడిగా, అతనిని చూపడం సమజసంగ
లేదు. వ్యంగ్యం శృతిమించి, దారుణమై
హేళనగా పరిణమించింది ఈనాటికలో.

సంస్కారములేని భార్య, సంస్కా
రముగల భర్త మధ్య జరిగే సంఘర్షణ—
'దాంపత్యం'. భార్య తెలివితక్కువతన
వల్లా, ఆమెకు సంస్కారం కలిగించడా
నికి భర్త సరిగా పూనుకోకపోవడం వల్లా
కలగే దుష్ఫలితాలు వారి జీవితాలను న
కం చేస్తాయి.

'ఇంటిగుట్టు'— తన కంటె పైస్థాయి
లో వున్న వారితో సమాన స్థాయిలోనికి
వెళ్లడానికి ప్రయత్నించే చిన్న ఉద్యోగ
స్తుడి జీవితం. ఇతను తనకన్నా తక్కువ
స్థాయిలోవున్న వారు, తనస్థాయికిరావడా
నికి అంగీకరించడు. తనకు పైనున్న వారిదగ్గ
రకు ఎగరడానికి ప్రయత్నిస్తాడు. కాని,
విఫలుడవుతాడు ఇంట్లో అత్తాకోడళ్లచీలి
కయ్యాలు ఊరినిండా అప్పులు. లేమిని
కప్పుకుని డాబూ, దర్పం చూపడానికి
ప్రయత్నం. సరైన మధ్యతరగతి జీవితం.

బస్తీచదువుకు వచ్చిన విద్యార్థి, తనపై
కొండంత ఆశపెట్టుకొని, కూలీనాలీ చేసి

కూడా తల్లి పంపుతూన్న డబ్బుతో దుబారాఖర్చులుచేసి, తరువాత జబ్బువచ్చి చచ్చిపోతాడు. ఈవిధంగా తల్లిని నట్టేట ముంచుతాడు. 'ద్రోహం' అన్న నాటికలో విషయం యిది.

"తోటివాళ్లతో తను పేదవాణ్ణని చెప్పుకోడానికి కాలేజీ స్టూడెంటుకి ఎంత నైతికబలం కావాలి" అని అతని 'స్నేహితుడన్నట్టు, యీ విద్యార్థి తాను భాగ్యవంతుడిగా మెలగడానికి ప్రయత్నించి, తల్లికి తీరని ద్రోహంచేస్తాడు. ఈ నాటికలో విద్యార్థి జీవితాన్ని సమీక్షచేస్తూ, ఒక పాత్ర చేసిన సంభాషణ, ఉపన్యాసంగా పరిణమించింది (పుట 152). ఈ సంపుటంలో, కొంత తక్కువ మోతాదులో యిటువంటివే ఒకటి రెండుచోట్ల దొర్లాయి. నాటకంలో సిద్ధాంతీకరణకు ప్రయత్నిస్తే, ఉపన్యాసం అయిపోక తప్పదు. నాటికారచనలో చేయితిరిగిన నార్లవారు కూడా వీటిని తప్పించుకోలేక పోయారు.

"ఆడబ్రతుకు"— ఆడబ్రతుకే మధురం అని మూర్ఛలుపోయేవారికి, స్త్రీజీవితంలోని పరాధీనతనూ, పతితస్థితినీ చూపే నాటిక.

దొంగవ్యాపారి జీవితంలోనూ, లంచగొండి ఉద్యోగి జీవితంలోనూ వున్న ద్రోహాన్నీ, నీచత్వాన్నీ కడిగివదిలిపెట్టిన నాటిక — "దొంగ—దొర." కూటికి చాలనిజీతంతో మాడుతూన్న గుమాస్తాను కాల్చుకుతిని, అతని ఆత్మహత్యకు కారణమవుతాడు దొరగా చెలామణీఅవుతూన్న దొంగవ్యాపారి. దొంగ వ్యాపారులూ, లంచగొండి ఉద్యోగులూ, తమ కిరాతక చర్యలవల్ల ప్రజలకు యెంత ఘోరస్థితి కలిగించారో సూచించకపోవడం, యీనాటికలో లోపమే.

"అర్ధాంగి" — బాగా పైస్థాయిలో వున్న విద్యాధికులైన దంపతుల జీవితం. ఉద్యోగంచేస్తూ ఆర్థికంగా స్వతంత్రురాలైన భార్య, భర్త ప్రోద్బలంవల్ల ఉద్యోగం మానుకుని అతని సంపాదనపై ఆధారపడుతుంది. ఒక అవమానకరమైన సంఘటన తటస్థించిన తరవాత 'మేలుకొని, పరాధీనతవల్ల— భర్తపైనైనా సరే— వచ్చే చెడుగును గుర్తిస్తుంది.

"అంచేత యీ నాటికలోని ("జీవజ్వాల") పాత్రలు చేసే ప్రశంసనుబట్టి పిల్సుడ్స్కీని ఆదర్శమూర్తిగా భావించడం కంటె పొరపాటు వుండబోదు" అని రచయిత ఉపోద్ఘాతంలో చెపుతూనే పోలండు నియంత పిల్సుడ్స్కీని ఆదర్శమూర్తిగా చిత్రించి, పాఠకులను "పొరపాటు"లో పడేటట్టు చేశారు. పిల్సుడ్స్కీ పట్ల రచయితలు వెల్లడించిన అభిప్రాయానికి విరుద్ధమైన ఫలితం యీ నాటిక కలిగిస్తుంది. ఛిన్నాభిన్నమైన పోలండుదేశాన్ని ఏకఖండంగా చేసినంతవరకూ, చరిత్రలో పిల్సుడ్స్కీపాత్ర అభ్యుదయకరమైనదే. కాని అతను అంతటితో సంతృప్తిపడలేదు. ఇతరదేశాలకుచెందిన (జర్మనీ, సోవియట్ లిథూనియా) ప్రాంతాలనుకూడా పోలండులో కలుపుకుని, సామ్రాజ్య దురహంకారి అయ్యాడు. నిరంకుశ పరిపాలన సాగించి, తన పోలిష్‌జాతి ప్రజలనూ, ఇతర అల్పసంఖ్యాక జాతులనూ అణగ

ద్రొక్కుతాడు. ఇట్టి వ్యక్తిని—ముఖ్యంగా యీ ప్రజాస్వామిక యుగంలో—ఆదర్శమూర్తిగా చిత్రించడం అందులోనూ పిల్సుడ్‌స్కీపట్ల రచయితకున్న అభిప్రాయానికి వ్యతిరేక ఫలితాలనిచ్చే పద్ధతిలో చిత్రించడం— యదార్థ చరిత్రను తెలిసి కూడా తప్పుడు వ్యాఖ్యానం చెయ్యడమే అవుతుంది. ఈ నిరంకుశుణ్ని, 'అతని నమ్మినబంటు (నాటికలో 'తాత' పాత్ర) ఆదర్శమూర్తిగా పూజించవచ్చు. అంత మాత్రంచేత పిల్సుడ్‌స్కీని ఆదర్శమూర్తిగా చిత్రించి, పాఠకులలో పూజ్యభావం కలిగించడం—ఉపోద్ఘాతంలో నిజంచెప్పానని సంతృప్తిపడినప్పటికి- సాహిత్య ప్రయోజనాన్ని గుర్తించకపోవడమే అవుతుంది. ఈ నాటికలో రచయిత లక్ష్యం ఒకటైతే దెబ్బ యింకోచోట తగిలింది. సాహిత్య ప్రయోజనంపట్ల స్పష్టమైన అభిప్రాయాలు గల నార్లవారివంటి రచయిత యిది చేయవలసింది కాదు. పిల్సుడ్‌స్కీలోవున్న లోపాలులేనిఇంకోవ్యక్తి జీవితాన్ని చరిత్రనుండి తీసుకునిగాని, కల్పించిగాని యిదే నాటికను వ్రాసివుంటే - దీని రచనలో వున్న శక్తికి సత్ప్రయోజనం కలిగి వుండేది. పిల్సుడస్కీ పాత్ర విషయం మినహాయిస్తే, యిది ఆదర్శవంతమైన దేశభక్తినీ, వీరత్వాన్నీ, ఆత్మత్యాగాన్నీ ప్రదర్శించిన చాలా శక్తివంతమైన నాటిక.

మొత్తంగా చూస్తే, సంపుటం లోని నాటికలన్నీ ('నవకవి' తప్ప), చాలా పైస్థాయికి చెందినవని చెప్పడానికి సందేహించనక్కరలేదు. ముఖ్యంగా గ్రామజీవితానికి చెందిన నాటికలు నుడికారంలో, పాత్రపోషణలో, సన్నివేశాలలో అపూర్వమైనవి. నాటికలన్నిటిలోనూ, సంఘాన్నిబాధిస్తున్న యేదో ఒక సమస్యను యెత్తుకుని, అభ్యుదయకరమైన పద్ధతిలో చాలా సమగ్రంగా, నార్లవారు నిర్వహించారు.

'దాంపత్యం', 'దొంగ—దొర' 'ఆడబ్రతుకు' అన్న నాటికలలో, పాశ్చాత్య రచయితల పద్ధతిని అనుసరించి, కొత్త టెక్నిక్ అవలంబింపబడింది. మొదటి రెండూ మొనోలాగ్ పద్ధతిలో రాసినవి. రెంటిలోనూ సంభాషించేది ఒకే పాత్ర. 'దాంపత్యం'లో, మాటాడకపోయినా, రెండోపాత్ర రంగంమీద కనిపిస్తాడు. 'దొంగ—దొర'లో రెండోపాత్ర చేయి తప్పితే యింకేమీ ప్రేక్షకులకు కనిపించదు. నవీనసాధనాలు లేకపోతే, 'ఆడబ్రతుకు' ప్రదర్శించడం అసాధ్యం. ఈ నాటిక తప్పితే, తక్కినవన్నీ ఏకరంగ నాటికలుగానే రచింపబడడం గమనించవలసిన విషయం. ప్రదర్శనదృష్ట్యా ఏకాంకాలుకంటె, ఏకరంగాలు చాలా అనుకూలమైనవి. కాని, రచయితకు మాత్రం దీనిలో చాలా యిబ్బందు లున్నాయి. వీటన్నిట్నీ దాటి, నార్లవారు రచనను చాలా సమర్థంగా నిర్వహించడం ప్రశంసించవలసిన విషయం.

ఈ నాటికలు రంగస్థలముపైని కూడా మెప్పు పొందగలవని ఆశిస్తున్నాము. సంఖ్యలోనూ, స్థాయిలోనూ యింకా యెంతో పెరగవలసిన మన నాటికా సాహిత్యం, నార్లవారి చాలా ఉత్తమ

# శ్రావణి

శ్రీ 'వేదుల' దంపతులు

నోములు నోచిన భామల్లారా
వ్రతాలు పట్టిన వనితల్లారా
పుణ్యము పండిన పురంధ్రులారా
పేరంటానికి రారండమ్మా.
గుమ్మడి పూవులు కొప్పునతురిమి
కడిమిమొగ్గసర మెడదనుదాల్చి
చెవులకు తంగేటిపువ్వు లమరించి
మొగలిపుప్పొడిని మొగమునపూసి
బుట్టమాలతిని బొట్టుపెట్టుకొని
నీలి క్రొమ్మొగిలు మేలిముసుగులో
మెరుపుల సొమ్ములు మిలమిలమెరయగ
దారి వెంటముత్యాలు గురియగ
వెలుగు నీడలు మడుగులొత్తగా
ఇన్నాళ్ళకు ఈనాడదిగో
భారతమహిళల భాగ్యలక్ష్మిగా
స్వాతంత్ర్యశ్రీ సహచారిణిగా
వచ్చెను మన శ్రావణ వరలక్ష్మి

నాటికలూ, నాటకాలూ కూడా ఆహ్వానిస్తోంది.

అంతర్యం వలెనే ఆకారంలో కూడా, యీ సంపుటంలో చాలా ఓర్పూ నేర్పూ కనిపిస్తున్నాయి. తేజోమూర్తుల కేశవరావు, హెచ్. వి. రామగోపాలరావు గార్ల సన్నివేశాలననుసరించి చిత్రించిన చక్కని బొమ్మలూ, అచ్చు, బైండింగు మొదలైనవన్నీ— తెలుగులో యింత చక్కనిపుస్తకం రాలేదనిపిస్తున్నవి. పుస్తకం చూసినా, చదివినా– ధర పదిరూపాయలు ఎక్కువ కాదనిపించినా, మనపాఠకులకు అందుబాటులో లేకపోయిన దనిపించుతున్నది. తక్కువ ధరకు మరో ముద్రణ వేస్తారని ఆశించుతాము.

పుణ్యము పండిన పురంధ్రులారా
పేరంటానికి రారండమ్మా!
పరాధి పత్యపు నిరంకుశత్వము
పరాధీన జన నిరాశ తత్వము
కూడుగుడ్డ పడగొట్టిన దోపిడి
గుండెలు రాచిన కోరలరాపిడి
తరాల తరబడి తరిమిన దాస్యము
అవాంత రమ్ములు అవమానములు
ప్రవాసబాధలు ప్రాణహరణములు
లేవు లేవు రాబోవిక మనకు
పుణ్యము పండిన పురంధ్రులారా
నేటినుండి ముమ్మాటికి నిజముగ
సుస్వతంత్రులము సుమండి మనము
నేడే మనకు నిజమగు పండుగ
ఇన్నాళ్ళకు ఇదే శ్రావణము
స్వతంత్ర మహిళా జనపార్వణము
త్రివర్ణ చక్ర ధ్వజచ్ఛాయలో
స్వాతంత్ర్య శ్రీ సహచారిణిగా
వచ్చిన మన శ్రావణ వరలక్ష్మికి
పసుపు కుంకుమల కుసుమాంజలుల
పూజ చేసి, నీరాజన మెత్తి
పిల్లలు పెద్దలు పేరంటాండ్రు
భారత విజయము పాడుకొనండి
జయజయభారత ప్రియ జనయిత్రీ!
సమస్తభారత సమైక్యధాత్రీ
నవశకోదయానంద విధాత్రీ!
స్వతంత్ర హిందూస్థాన సవిత్రీ!

# అయస్కాంతత్వము

శ్రీ డి. ఎ. ఎ. ఎస్. నారాయణరావు

సూదంటురాయి చిన్న చిన్న ఇనుప వస్తువులను ఆకర్షిస్తుందని చాలకాలమాయి అందరికీ తెలిసిన విషయమే. 16 వ శతాబ్దంలోని విలియము గిల్బర్టు — ఎలిజబెత్తు మహారాణికి డాక్టరు- ఈవిషయం గురించి అనేక పరిశోధనలుచేసేడు. దీనిగురించిన జ్ఞానం అప్పటినుండి త్వరత్వరగా వృద్ధిపొందింది.

అయస్కాంతము లేక చుంబకం ఇనుమును ఆకర్షిస్తుంది. ఇదిగాక దానికి ఇంకొక ముఖ్యగుణం వుంది. ఒక అయస్కాంతమునకు మధ్యగా త్రాడుకట్టి స్వేచ్ఛగా వ్రేలాడదీస్తే, ఉత్తర దక్షిణములను చూపుతుంది, దానిని ఎటు వ్రేలాడ దీసినా ఉత్తర దక్షిణ దిక్కుగా తిరిగి అక్కడఆగుతుంది. భూమిలో ఒకఅయస్కాంతక్షేత్రం ఉంది. దానిమూలంగానే ఈఅయస్కాంతమాలాగు ఒక ప్రత్యేక దిక్కువైపు తిరుగుతుంది. ఈ ధర్మాన్ని సముద్ర మధ్యంలో ప్రయాణం చేస్తున్న నావికులు ఎక్కువగా ఉపయోగించుకొంటారు. వారు దిక్కులను దీని మూలంగా తెలిసికొని పడవను అవసరమైన దిక్కులో నడుపుకుంటారు.

ఒక అయస్కాంతాన్ని ఇనుప రవ్వలవద్ద పెడితే దాని చివరలకు మాత్రమే అవి ఎక్కువగా అంటుకొంటాయి. మధ్య ప్రదేశానికి అంటుకోవు. ఈ అయస్కాంతత్వము చివరలను కేంద్రీకరింపబడిందన్నమాట. ఆచివరలకు ధృవాలు (Poles) అని పేరు. వ్రేలాడ దీసినపుడు ఎప్పుడూ ఒక చివరే ఉత్తరంవైపు తిరుగుతుంది. దానికి ఉత్తర ధృవమని పేరు. రెండవ దానికి దక్షిణ ధృవమని పేరు. అయస్కాంతాన్ని రెండు ముక్కలుగా విరిచినపుడు ఒక ముక్కలో దక్షిణధృవం, ఒక ముక్కలో ఉత్తర ధృవం మాత్రముంటాయనుకోరాదు. అలాగ విరిగిన

ఒక ముక్కలోనే మళ్ళీ రెండు ధృవా లేర్పడతాయి. ఇలాగ ఒక అయస్కాంతిని విరుస్తూపోతే, ఆ చిన్న చిన్న ముక్కలన్నీ చిన్న చిన్న అయస్కాంతాలుగా ఏర్పడ తాయి. దీనిని బట్టి ఆలోచిస్తే, ఒక అయస్కాంత మన్నది వరుసలు తీర్చిన అనేకమైన, కంటికి కనబడని చిన్న చిన్న అయస్కాంతముల సముదాయం అని తేలుతూంది.

ఇనుము కోబాల్టు నికెలు అను మూడు పదార్థాలు అయస్కాం తత్వమును ప్రదర్శించ గలవని తెలుస్తూంది. ఇవి సాధారణస్థితిలో అయస్కాంతాలుగా ఉండక పోయినా, వీటిని అయస్కాంతా లుగా మార్చవచ్చును. ఈ పదా ర్థాలన్నిటిలోను అతి చిన్న చిన్న అయస్కాంతాలుంటాయి. కాని అవి వరుసలు తీర్చి ఉండక చిందర వందరగా ఉంటాయి. అవి అలా చిందరవందరగా ఉన్నప్పుడు, మొత్తంమీద అయస్కాంతత్వా న్ని ప్రదర్శించవు. కాని ఈ పదా ర్థాలలో దేనిలోనైనా వున్న చిన్న చిన్న అయస్కాంతాలును కొన్ని మార్గాలవల్ల వరుసలలో ఏర్ప రచ వచ్చును. అప్పుడు ఆపదార్థం మొత్తం మీద అయస్కాం తత్వాన్ని ప్రదర్శిస్తూ, అయస్కాం తంగా అగపడుతుంది.

ఒక తీగ చుట్టలోనుండి విద్యు త్తును పంపుతూ, దాని మధ్యగా మెత్తని లోహపు కడ్డీలనుంచితే, వాని లోని చిన్న చిన్న అయస్కాంతాలు వరుసలలో ఏర్పడడం మూలంగా అవి అయస్కాంతాలుగా మారు తాయి. విద్యుత్తుమూలంగా అయ స్కాంతములయే ఇటువంటి విద్యు దయస్కాంతముల సహాయంతోనే గంటలు కొట్టించడం, టెలిగ్రా ములు పంపడం మొదలైనవి వీలవు తాయి.

అయస్కాంతత్వానికీ, విద్యు త్తుకీ అవినాభావ సంబంధముంది. ఈ సంబంధాన్ని గుర్తించడం మూలంగానే విద్యుత్పరిశ్రమ విశే షంగా వృద్ధిపొందింది. మొట్టమొ దట దీనిని గ్రహించిన వాడు ఆయర్ స్టెడ్ అను డేనిషు శాస్త్ర జ్ఞుడు.

ఒక లోహపు తీగచుట్ట మధ్యలో ఒకచిన్న తేలికైన అయ స్కాంత సూదిని వ్రేలాడ దీసే

మనుకోండి. ఆ సూది భూమి యొక్క అయస్కాంత క్షేత్రం మూలంగా ఉత్తర దక్షిణాలుగా తిరిగి ఉంటుంది. తీగలోనుండి విద్యుత్ప్రవాహాన్ని పంపితే అయస్కాంతపు సూదిఇంకో ప్రక్కకు తిరుగుతుంది. తీగలోనుండి విద్యుత్ప్రవాహం వెళ్ళినపుడు అయస్కాంతపుసూది తన మామూలు స్థానంనుండి ఇంకో ప్రక్కకి తిరిగింది అంటే అర్థమేమిటి ? అయస్కాంత క్షేత్రం సూదిని తన వైపుకు ఆకర్షించుకొనే శక్తి కలిగివుంది. కనుక క్రొత్తగా ఇంకొక దిక్కులో అయస్కాంతక్షేత్రం వచ్చి,సూదిని తిప్పిన దన్న మాట. కనుక విద్యుత్ప్రవాహం వెనుక దాని మూలంగా ఒక అయస్కాంత క్షేత్రముంటుందన్నమాట.

విద్యుత్ప్రవాహం వెంటఎప్పుడూ కూడా అయస్కాంత క్షేత్రం ఉంటుందని కొన్ని ప్రయోగాల వలన నిర్ధారణ చేసేరు. అంతేగాక ఒక అయస్కాంత క్షేత్రంలో ఒక తీగ చుట్టనుంచి, ఆ క్షేత్రంలో మార్పులు తేవడంవలన తీగలో విద్యుత్తు దానంతట అది పుడు తుందని కనుగొన్నారు. విద్యుత్ప్రవాహంవల్ల అయస్కాంత క్షేత్రం కలగడమే కాకుండా, అయస్కాంతక్షేత్రంలో మార్పులవలన విద్యుత్తును పుట్టించ వచ్చునన్న మాట. ఇలాగ విద్యుత్తు అయస్కాంతత్వము ఒక దానినుండి యింకొకటి రాగలుగుతూ, సన్నిహిత సంబంధం కలిగిఉన్నాయి. ఈ సంబంధాన్ని జాగ్రత్తగా పరిశీలించడం వలననే ఎలక్ట్రిక్ పంకాలు, ఎలక్ట్రిక్ మోటారులు. డైనమోలు మొదలైనవన్నీ సాధ్యమయ్యాయి,

పదార్థమంతా ఎలక్ట్రాను ప్రోటానులనే విద్యుత్కణాలచే నిర్మింపబడింది. అవి సదా చలనం కలిగి తిరుగుతూవుంటాయి. కనుక ప్రతి పరమాణువులోను విద్యుత్ప్రవాహముంటుంది. దానినిబట్టి ప్రతి పదార్థంలోను అయస్కాంతత్వముండవద్దా ! ఇనుము కోబాల్టు నికెలు మాత్రమే ఈ ధర్మాన్ని కలిగివుండడ మెందు చేత అనే ప్రశ్నలు వస్తాయి. నిజానికి ద్రవ్యమంతా అయస్కాంతత్వాన్ని కలిగియుండ వలసినదే, కలిగియున్నది

కూడా. కాని అది మనకు సాధారణ పరిస్థితులలో అగపడడం లేదు.

పరమాణువులలో ప్రతి ఎలక్ట్రాను వలయంలో తిరుగుతూ వుంటుంది. ఆవలయంలో విద్యుత్ప్రవాహ మున్నదన్నమాట. కనుక అది ఒకచిన్న అయస్కాంతమునకు సమానం. అలాగే తిరుగుతున్న ప్రతి ఎలక్ట్రాను ఒక్కొక్క చుంబకమునకు సమానం. ఒక పరమాణువులో కొన్ని ఎలక్ట్రాను లున్నాయికదా. అందులో ప్రతి ఒక్కటీ ఒక చిన్న అయస్కాంతానికి కారణ మవుతూంది. కొన్ని మూలపదార్థాల తాలూకు పరమాణువులో చిన్న చిన్న చుంబకాలు ఒకదాని నొకటి ఖండించుకొని మొత్తంమీద పరమాణువు కేమీ అయస్కాంతత్వము లేకుండాచేస్తున్నాయి. అందుచేత పదార్థాలకుగాని,వానిపరమాణువులకుగాని మొత్తంమీద అయస్కాంతత్వముండదు. ఆర్గాను నియాను క్రిప్టాను మొదలైన వాయువులన్నీ ఇటువంటివే. వీనిని ఒక పెద్ద అయస్కాంతక్షేత్రంలో పెట్టినపుడు, ఎలక్ట్రాను వేగంలో కొంతమార్పు వచ్చి, దానికి అదనంగా కొంత అయస్కాంతత్వం వస్తుంది. ఇలాగ కొత్తగా వేరువేరు ఎలక్ట్రానులకి వచ్చిన అయస్కాంతత్వం ఒక భాగాన్ని ఒక భాగం ఖండించుకోదు. అన్నీ కలుస్తాయి. కనుక మొత్తంమీద పరమాణువు కి కొంత అయస్కాంతత్వముంటుంది. దానినిబట్టి మనము తీసికొన్న ద్రవ్యమంతటిలోను ఈఅయస్కాంతత్వాన్ని చూడవచ్చును ఇది చాలా స్వల్పంగానే ఉంటుంది. వేరువేరు పదార్థాలకి వేరువేరు పరిమాణాల్లో ఉంటుంది. ఇలాగున పరమాణువు సాధారణస్థితిలో అయస్కాంతత్వరహితమైనప్పటికీ, అయస్కాంతక్షేత్రంలో కొద్దిగా అయస్కాంతత్వమును ప్రదర్శించే పదార్థాలను డయామేగ్నెటికు పదార్థాలంటారు.

ద్రవ్యంలో ఇంకొక రకపు అయస్కాంతత్వ ముంటుంది. ఒక పరమాణువులోని ఎలక్ట్రానులన్నీ కొద్దికొద్దిగా అయస్కాంతత్వం కలిగి ఉన్నపుడు, అవి ఒకదాని నొకటి పూర్తిగా ఖండించుకోవు.

వాని అయస్కాంతత్వం చాల వరకు పోయినను, మొత్తంమీద ఒక్కొక్క పరమాణువుకి కొద్దిగా అయస్కాంతత్వముండి పోతుంది. పరమాణువుకి అయస్కాంత తత్వమున్న, రాశిలోఉన్న పదార్థం మట్టుకు ఆధర్మాన్ని చూపెట్టదు. పదార్థంలో పరమాణువులు వేరు వేరు దిక్కులలో చిత్తమొచ్చినట్లు తిరుగుతూ వుంటాయి కదా! అలా తిరుగుతున్నప్పుడు ఆ పరమాణుఅయస్కాంతాలు ఒకదానినొకటి ఖండించుకొంటాయి. కనుక మొత్తంమీద ఆ పదార్థం అయస్కాంతం కానట్టుగానే ఉంటుంది. ఇటువంటి దానిని బలమైన అయస్కాంతక్షేత్రంలో పెట్టినపుడు పరమాణుఅయస్కాంతాలన్నీ క్షేత్రానికి అనుగుణ్యంగా తిరగడానికి ప్రయత్నిస్తాయి. అవి తమ తాపాన్ని, వక్రబుద్ధిని పూర్తిగా అణచుకో లేకపోయినా, కొంత వరకు సర్దుకొని, కొంత వరకు క్షేత్రాని కనుగుణ్యంగా తిరుగుతాయి. ఆ సందర్భంలో మొత్తం మీద పదార్థం కొంత అయస్కాంతత్వాన్ని ప్రదర్శిస్తుంది. ఇటువంటి పదార్థాలను పెరామేగ్నెటిక్ పదార్థా లంటారు. అయస్కాంతక్షేత్రం తీసివేయగానే వీని అయస్కాంతత్వం పూర్తిగా పోతుంది.

పై రెండు రకాల పదార్థాలు అయస్కాంత క్షేత్రంలో ఉన్నప్పుడు ప్రదర్శించే అయస్కాంతత్వం చాలా తక్కువగా ఉండుట చేత అవి చాలాకాలం గుర్తింపబడలేదు. కాని, ఇప్పుడు అవి ప్రదర్శించే గుణాలను పరిశీలించడం మూలంగా అణువులో పరమాణువుల ఏర్పాటు, స్ఫటికములలో పరమాణువుల ఏర్పాటు మున్నగునవి తెలిసికోడానికి అవకాశాలు ఏర్పడుతున్నాయి.

మనము మామూలుగా అయస్కాంత పదార్థాలుగా గుర్తించే ఇనుము నికెలు కోబాల్టులను ఫెర్రోమేగ్నెటిక్ పదార్థాలంటారు. మనము సుళువుగా తెలుసుకోడానికి వీలయినంతగా అయస్కాంతత్వాన్ని ప్రదర్శిస్తా యివి. ఒక ఇనుపకడ్డీ, దాని చిన్న భాగాలలో వరుసా వావీ లేకపోవడం వలన, సాధారణంగా అయస్కాం

తము కాకపోవచ్చును. కాని దానిని అయస్కాంత క్షేత్రంలో పెట్టో, ఇంకేవిధంగానో దానిలోని చిన్న భాగాలను ఒకమారు వరుసలలోకి తెస్తే, ఆ క్షేత్రం తీసివేసిన తర్వాతకూడా ఆ భాగాలు వరుసలలోనే ఉంటాయి. కనుక అది అయస్కాంతంగా ప్రవర్తిస్తుంది.

నూతన విజ్ఞానం వలన తెలుస్తున్నదేమంటే- ద్రవ్యానికంతకూ విద్యుత్తు ఎలాగు మూలమైవుందో, అయస్కాంతత్వంకూడా అలాగే మూలమై వుంది. అయితే ఎలక్ట్రానులు ఒకదానిఅయస్కాంతత్వము నొకటి ఖండించుకొనడంమూలంగా పరమాణువులు, లేక పరమాణువులు నొకదాని నొకటి ఖండించుకొనడం మూలంగా ద్రవ్యరాశి అయస్కాంత రహితంగా అగపడుతున్నాయి. ఏ కొద్ది పదార్థాలో మాత్రమే మామూలు పరిస్థితులలో అయస్కాంతత్వాన్ని మనకు తెలిసేటట్లుగా ప్రదర్శింప గలుగుతున్నాయి.

విద్యుత్కణాలైన ఎలక్ట్రానులు తిరగడం మూలంగా అయస్కాంతత్వం ప్రతి పదార్థంలోను ఉద్భవిస్తుందనీ, కొన్నింటిలో అది పైకి అగపడుతుందనీ పైన చూసేము. భూగ్రహంలో ఒక అయస్కాంత క్షేత్రం వుంది దీనికి కారణంభూమిచుట్టూ వాతావరణంలో కొన్ని విద్యుత్ప్రవాహా లుండడమని అనుకునేవారు. కాని భూమియొక్క అయస్కాంతత్వాన్ని గురించి ఒక విప్లవకరమైన సిద్ధాంతం ఈ మధ్య వచ్చింది. విద్యుత్ప్రవాహం యొక్క అవసరం లేదనీ, ఒక వస్తువు అతిజోరుగా గిరున తిరుగుతున్నప్పుడు ఆ చలనం మూలంగానే అందులో అయస్కాంతత్వం ఉద్భవిస్తుందనీ బ్లాకెట్ అను శాస్త్రజ్ఞుడు సూచించేడు. భూమి తనలో తాను అపరిమిత వేగంతో తిరగడమే భూమియొక్క అయస్కాంతత్వానికి కారణమని ఇతడి సిద్ధాంతం. సాధారణచలనం అయస్కాంతత్వము సంబంధము కలిగి ఉండుట ప్రస్తుత అభిప్రాయాలకు విరుద్ధంగాను, విప్లవకరంగాను అగపడుతుంది. సాధారణ వస్తువులను విద్యుత్తుతో సంబంధం లేకుండా చలనంద్వారా మాత్రం అయ

# మన కథల్లో లోపాలు

ఛార్లెస్ హాంబోల్ట్

కొన్ని మాసాల క్రితం 'న్యూమాసెస్' పత్రికా నిర్వహణంలో ముందు చెయ్యవలసిన మార్పుల విషయం చర్చిస్తూ, ఒక చిన్న కథ, లేదా— ఒక నవల, వరుసగా ప్రతి సంచికలోను ప్రచురించాలని మేము ఒక నిర్ణయానికి వచ్చాం. సరైన కథలు లభించక అయితేనేం, తలవని తలంపుగా కలిగే స్థలాభావంవల్ల నయితేనేం, ఏకొన్ని వారాలో అలా ప్రచురించలేక పోయాం. కాని, మొత్తంమీద మేమనుకొన్న కార్యక్రమం సక్రమంగానే కొనసాగుతున్నది. ఇంతవరకూ నేను మాకువచ్చిన ఐదారు వందల కథలు చదివాను. అవి చాలాభాగం, ఇంతకుముందు ఏ పత్రికలోనూ ప్రచురించబడ్డవి కావు. అదీకాక, ఆ కథకులందరూ యువరచయితలే. వారిలో చాలామందితో ఉత్తరప్రత్యుత్తరాలుకూడా జరిపాం. ఈ యువరచయితలను ముందుగా అభినందిస్తూ వారి కృషిని గూర్చి చర్చిద్దాం.

అప్పుడప్పుడు అందరూ ఆదుర్దాగా చదివి చర్చించే కొన్ని ప్రత్యేకమైన కథల్ని గూర్చి సవిమర్శకంగా ఈ దిగువ నేనుదాహరించే అభిప్రాయాలను యథాతథంగానే పాఠకులు గ్రహిస్తారని నమ్ముతాను. సాధారణమైన సారస్వతాశయాలను వ్యక్తంచేస్తూ, ఉన్నతసాహిత్యసృష్టికి దోహదం చేసే నవీన పద్ధతుల్ని సూచించడమే నా ముఖ్యోద్దేశం.

ప్రస్తుత రచనావిధానంలోని శిల్పవిశిష్టత, ముచ్చటైన మాటలకూర్పు, నూత్న కళారూపాలను స్వీకరించడం, స్వతహాగా శక్తిలేని రచయితల భాషాడంబరం— ఈ సామాన్య సాహిత్యప్రవృత్తులను పరిశీలిస్తూ, వాటిని గూర్చి చర్చించడం నా వుద్దేశం కాదు.

సాహిత్యమనేది విజ్ఞానంలో మార్పును అభివృద్ధిని సాధించే ఒక సాధనం ఇదే మా విశ్వాసం. ఈ దృష్టితోనే చర్చిద్దాం. సాహిత్యం జీవితానికి ప్రతిబింబం. చైతన్యవంతులైన పాఠకలోకంలో సాహిత్యానికి చాలా ఉన్నతస్థానంవుంది; వినోదానికి కాదు. కనుక, సాహిత్యచర్చ అన్నప్పుడు మన జీవితాన్ని గూర్చి చర్చించడమే అవుతుంది.

నేటి పెట్టుబడిదారీ సమాజంలో కాలరాచి వేయబడి, వారి కళాసిద్ధాంతాలతో

---

సాంతంగా మార్చడానికి ఇంకా వీలవడంలేదు. అలా మార్చడానికి తగిన పరిస్థితులు ఏర్పడినపుడు ఈ సిద్ధాంతము ఋజువవడమే కాక, కొన్ని ఉపయోగాలకు, ప్రకృతిని గురించిన జ్ఞానములో కొన్ని ముఖ్యమైన మార్పులకు దారితీయవచ్చును.

సంకుచితం చేయబడిన మానవత్వ గౌర వాన్ని పునఃస్థాపించడమే మాయొక్క స్పష్టమైన, సరళమైన కార్యక్రమం.

ఇదివర కెప్పుడూ యీనాటి యువ రచయితల్లాగా, బహుశః ఏరచయితా, ఇలాంటి వైరుధ్యాలనూ ఆకర్షణలనూ ఎదుర్కొని వుండడు. రచనకోసం జీవించ డానికి బదులు, ఈనాటి రచయిత జీవిం చడం కోసం రచన వినియోగింపజేసే అనేక శక్తులతో పోరాడవలసి వస్తున్నది. ఎప్పుడూ దాస్యానికి తలఒగ్గ కుండా, యెంత క్లిష్టపరిస్థితుల్లోనయినా లొంగిపోకుండా, రచయిత ఎల్లప్పుడూ సత్యాన్నే చెప్పాలి. ఈనాటి సమాజం లోని నిరోధకశక్తులేకాక, వాటికితోడు బూర్జువాసాహిత్యవేత్తలు కల్పించిన అఖా తాలు కూడా దాటవలసినవి యువ రచ యితల కెన్నో వున్నాయి. ఎక్కడో స్వాప్నిక జగత్తులో అగాధమైన మానవ లక్ష్యం, ఉన్నత సత్యం గోచరిస్తాయనే భ్రమ ఇంకా అనేకమందిని ఆవరించివుంది. రచయిత వాస్తవిక జీవితానికిచ్చే విలువలు ఆతని ఆశయాలు స్పష్టంగా రచనల్లో వ్యక్తమయితే, అది అతని రచనా శిల్పానికి భంగం కలిగిస్తుందనే సిద్ధాంతం వుంది. ప్రత్యక్షానుభూతిని పొందేవీ, దాన్ని గుర్తించేవీ, ఇంద్రియాలేగదా! కార్య కారణదృష్టి కల్పనా జగత్తులో బలవం తంగా చోటుచేసుకొని చొరబడుతుందనీ, కవిత్వానికి దానితో ప్రత్యక్ష సంబంధం ఏమీ లేదనీ, సత్యమనేది దాన్ని దర్శించే వ్యక్తికి సంబంధించింది మాత్రమేననీ, అది కేవలం వ్యక్తిగతమైనదనీ, ఊహాలోకంలో దాన్ని దర్శించిన వ్యక్తికే అవగత మవు తుందనీ అనేవారుకూడా వున్నారు.

ఇంకా అనేక రకాల విపరీతమైన మిథ్యావాదాలు వ్యాప్తిలో వున్నాయి. ఆ రమ్యహర్మ్యాలన్నీ మానవస్వేచ్ఛనిరాశా నిస్పృహా పథాల ననుసరించడంలోనే వుందని సిద్ధాంతీకరించడానికే నిర్మించ బడ్డాయి. జీవితప్రయోజనాన్ని గుర్తించక పోయినా, మానవుని జీవితం ఏదో యిది వరకే నిర్ధరించబడిన విధానంలోనే సాగి పోతుందని అంటారు. జీవితం విధికృత మని వాళ్ళ సిద్ధాంతం.

కళకు జీవితాన్ని అంకితంచేసి, కళో న్నతికి ఆహుతైపోవడమే రచయితకు విముక్తి అని కొందరివాదం. ఈ భావ కవిత్వధోరణులే రచయితలను, వారి నెదుర్కొంటున్న దైనందిన పోరాటాల నుంచి దూరంచేస్తాయి. పెడమార్గం పట్టి స్తాయి. అయితే మనలో కొద్దిమంది రచ యితలే ఈ పెడదారిన పడ్డారని చెప్పడం ఎంతో సమంజసం.

మనలో సైతం ఎన్నో లోపాలు లేక పోలేదు. వాటి నంగీకరించే అవసరాన్ని గుర్తించడం మన కెంతో ఉపయోగం కూడా. ఆ లోపాలన్నిటినీ గుర్తించి, నిర్వచించి, వాటికి మూలం ఏమిటో చర్చించాలి. ముఖ్యంగా మన సాహిత్యా నికి ప్రతిబంధకంగా వున్నది మన ఆశయా నికి దోహదమిచ్చే అభ్యుదయ పత్రికలు ఎక్కువగా లేకపోవడమే. ఉన్న ఒకటి రెండు పత్రికలు కూడా ఆగిపోవ డంవల్ల, మన రచయితల అభివృద్ధికే మాత్రం అవకాశం లేకపోయింది.

ఎక్కడా ప్రచురణ కానిది వ్రాయడం దేనికి? ఇక మన రచయితలు సినిమాలకు కథలు వ్రాయడానికీ, నవలలు వ్రాయడానికీ తయారైనారు. వ్యాపార దృష్టితో నడిచే చౌకబారు పత్రికలకు కూడా వాటికి అనువైనట్లు రచన చేసారు. 'అట్లాంటిక్ మంత్లీ' 'న్యూయార్కర్' ఈబాపతు పత్రికలకు ఎంతో చెత్తచెదారం సరఫరా చేసారు. కొంతమంది అసలు రచనకే విడాకులిచ్చారు. అయితే, వ్యాపారపత్రికలకు రచన చెయ్యకూడదని మనం ఛాందసంగా చెప్పడం లేదు రచయితలు తమ పవిత్రతను ప్రకటించుకోడానికని, ఆకలితో మృత్యువును ఆహ్వానించాలనికూడా మనం కోరడం లేదు. కాని, ఒక్క విషయం చెప్పాలి. బ్రౌడర్ ఏ ఎండకా గొడుగు పట్టి, విప్లవసిద్ధాంతాలను వికృతం చేసిన కాలంలో, అనేకమంది అభ్యుదయ రచయితలు మనకుదూరమైనారు. అలాంటి రచయితలు ఈ సినిమాలను, పత్రికలను పట్టుకొని, బూర్జువా రచయితల మాదిరిగానే మనమూ అనేక విజయాలు సాధించవచ్చునని చెప్పడం మొదలుపెట్టారు.

ఈ పతనావస్థలో మనలోని ఉత్తమ రచయితలందరూ మనకు తమ రచనలను పంపడమే మానేసారు. చాలామంది రచనకే స్వస్తి చెప్పి మూల కూర్చున్నారు ఈ దుర్దశ వాళ్ల ఆశయాలకూ, కృషికీ ఉన్న స్పష్టతను కూడా వికలం చేసింది.

'మెయిన్ స్ట్రీం', 'న్యూ మాసెస్' పత్రికలద్వారా ఈ అభ్యుదయ శక్తులన్నిటినీ కూడగట్టుకొని, ఇప్పుడిప్పుడే మళ్ళీ విప్లవసాహిత్యం తలెత్తుతున్నది. యువరచయితలు తమ కళానైపుణ్యాన్ని పెంపొందించుకోకుండా యుద్ధం కొంత ఆటంకం కలిగించింది. వారి యుద్ధానుభవాలను వట్టి సంఘటనలుగా మాత్రం కాక, ఆ అనుభూతి సంతటినీ జీర్ణించుకొని, నిండుగా, సజీవంగా రచనల్లో ప్రతిబింబించడానికి వారి కింకా కొంతకాలం పడుతుంది. అప్పుడే వారి రచనలన్నీ వెలుగులోకి వస్తాయి.

యుద్ధసాహిత్యానిగూర్చి, యుద్ధానంతర సాహిత్యాన్ని గూర్చి చెప్పేటప్పుడు ఒకవిషయం మాత్రం స్పష్టంగా వ్యక్తం చేయాలి. యుద్ధస్వభావాన్ని నిర్ణయించడంలోను, విజయాన్ని విలువగట్టడంలోను, అంచనా వెయ్యడంలోను మన సాహిత్యానికి ఒక విస్పష్టమైన పంథా వుంది.

యుద్ధంలో పాల్గొన్న రచయితలు యుద్ధాన్ని కథావస్తువుగా తీసుకున్నప్పుడు తమవ్యక్తిగతమైన బాధలూ, అస్పష్టమైన ఆవేదనలూ, కొలబద్దలుగా తీసుకొని - యుద్ధ స్వభావాన్ని ఎంతమాత్రం నిర్ణయించగూడదు. అలా చేస్తే, యుద్ధలక్ష్యాన్నీ, తత్ఫలితంగా సాధించిన మహత్తర విజయాన్నీ గుర్తించలేకపోతారు. ఫాసిస్టు విషదంష్ట్రల నుంచి సర్వమానవకోటిని విముక్తంచేసిన ఈ సంగ్రామ ఫలితాన్ని సరిగ్గా అర్థంచేసుకోలేకపోతారు. నిత్యజీవిత పోరాటాల్లో అనేక వైఫల్యాలు ఇంకా తప్పక పోయినప్పటికీ, మానవజాతి విముక్తికోసం జరిగినట్లు ప్రపంచమంతటా గుర్తించబడి, ఈ మహా యుద్ధలక్ష్యాన్ని గమనించడంలో, మనకు పెట్టుబడిదారీ దేశాల్లో, ఆ సామాజిక జీవితవ్యవస్థలోని ఆ సైన్యాలు, వ్యాపారం

యుద్ధభీభత్సం, కులమత భేదాలు, రాజకీయ కుతంత్రాలు, అవకాశవాదాలు, వాటివాటి పరస్పర వైరుధ్యాలు – ఇవన్నీ అడ్డురాగూడదు. మానవజాతి విముక్తి అనే లక్ష్యం వట్టి ఆదర్శం మాత్రమే కాదు. ఇదే మన ఆశయానికి ప్రాముఖ్యాన్ని, మన కార్యాచరణకు ఉన్నత స్థానాన్ని ఇస్తున్నది. పరిస్థితులెంతవిషమంగా వున్నా, మనమెన్ని పర్యాయాలు వైఫల్యము పొందినా, ఇప్పుడు ఈ యుగాన్ని గురించి స్థిరచిత్తంలో పర్యాలోకన చేసేటట్లయితే, యీ విజయమే ఈనాడు మనకు జీవితాశరేకెత్తిస్తున్నదనే చెప్పాలి.

ఇంత చెప్పినా, దాని ప్రాముఖ్యం ఇంకా పూర్తిగా చెప్పినట్లు కాదు. ఇంతే కాక, మానవజీవితంలోని నిరంతర విజయాన్ని రచయితలు తమ రచనల్లో ప్రతిబింబించాలి. అమెరికన్ కాంగ్రెస్‌లో సామ్రాజ్యవాదులు కొన్ని మహత్తరమైన విజయాలు పొందినమాట నిజమే. చావుతెంపుతో కూడిన వాళ్ళ బెదిరింపులు కూడా ప్రమాదకరంగానే వున్నాయి. వాళ్ళ ఈ చావుతెంపుకు కారణమేమిటో మనం తెలుసుకోవాలి. ఈ యుద్ధ విజయంతో తూర్పు యూరప్ దేశాల్లోని మధ్యయుగపు భూస్వామిక ఉక్కుపట్టాలనుంచి లక్షలాది ప్రజలు విముక్తులైనారు. అనేకమంది సామ్యవాద పథాలలో పురోగమిస్తున్నారు. వలసదేశాల్లో బానిసత్వంలో క్రుంగిపోతున్న ఆసియా వాసుల స్వాతంత్ర్య పోరాటాలకు యీ యుద్ధవిజయమే ఒక నూతనశక్తిని యిచ్చి

చరిత్రలో రానున్న నవశకానికి స్వాగతమిస్తున్నది. అమెరికాలో సైతం ఇక్కడి కార్మికులకు పోరాటం సాగించే చైతన్యం సంఘటితశక్తి అంతగా పెంపొందనప్పటికీ వారుకూడా పురోగామి పంథాలలో పోతూ, చైతన్యవంతులైన మధ్యతరగతి ప్రజలతో కలిసి, పోరాడేస్థాయికి తీసుకు వచ్చింది. ఇప్పుడొక మహత్తర శక్తిగా తయారైన కార్మికవర్గం, ఇక శత్రువులను, సామ్రాజ్యవాదులను మళ్ళీ తలెత్తనీయకుండా సమూలంగా సంహరిస్తుంది. ఇదే ఆఖరుదెబ్బ.

పాలకులు వారి పరిపాలనా యంత్రం ఛిన్నాభిన్నమై పోతున్నాయనీ యిక మీద సాగనున్న సమరంలో మనదే విజయమనీ, కార్మికవర్గానికీ, ఇతర పురోగామి వర్గాలకూ స్పష్టపరచడం మన విద్యుక్త ధర్మం. ఈ యుద్ధంలో జయించినట్లే, ముందుకూడా మనమే జయిస్తాం.

ఏ కొద్దిమంది అభ్యుదయ రచయితలో తమ అనుభవాలను ఈ సమిష్టి వాస్తవిక దృక్పథంలోనుంచి పరిశీలించి, సత్యాన్ని నిర్వచించగలుగుతారు. బూర్జువా రచయితల వెంబడే వారి తోక పట్టుకుపోవడం, వారిలాగా వ్యక్తిగతానుభవాలను, నిరాశలను ఆధారం చేసుకొని వ్యాఖ్యానం చెయ్యడం, అనేక అవకతవకలకు దారి తీస్తుంది. బూర్జువా రచయితల పాత్ర చిత్రణలో, ఆ పాత్రల చైతన్యంలో, గమనంలో చారిత్రకంగా వస్తున్న మార్పు లేవీ కనిపించవు వాళ్ళ కథ [illegible] పై సంవత్సరాల క్రితం [illegible] దశాబ్దాలనాటి సాంఘికానుభూతి అప్పు

దప్పుడు వాటిల్లో వ్యక్తమవుతూంటుంది. రూజువెల్టు యుగం మధ్యకాలం నుంచీ వచ్చిన మార్పులతో లక్షలాది మన అమెరికన్ల జీవితంలోను, ఆలోచనలలోను ఏర్పడ్డ కొత్తపోకడలు మన సాహిత్యంలో అభివ్యక్తం కావాలి. ప్రత్యక్షంగా కార్మిక సంఘనిర్మాణాన్ని చిత్రించక పోయినప్పటికీ, సమానత్వం కోసం, పౌరస్వత్వాల కోసం జరుతున్న అభ్యుదయోద్యమాలన్నీ మన రచనల్లో, మన పాత్రల ఆలోచనల్లో, కదలికల్లో ప్రతిబింబించాలి. బాల్జాక్ తరువాత ఏ రచయితా, తన పాత్రలయొక్క ఆర్థికస్థితిని విస్మరించలేదన్నప్పుడు— ఇక ఈ నాటి రచయితలు ఇప్పటి మహత్తరమైన సాంఘికోద్యమాల ప్రభావం తమ పాత్రల మనస్తత్వంమీద పని చెయ్యనట్లు నటించగలరా? సామాజిక పరిణామాలను గూర్చిన అనుభవాన్ని సంపాదించడం, ఆ అనుభవాన్ని వ్యక్తీకరించే స్థాయికి తన పాత్రలను తీసుకుపోవడమే— అభ్యుదయ రచయితయొక్క ప్రధానధర్మం.

ఇక్కడ కూడా రాజకీయ బాధ్యత సాహిత్యాశయాలకు ఎంతమాత్రం దూరం కాదు. తననాటి అభ్యుదయశక్తులను వ్యక్తీకరించని సాహిత్యం భావౌన్నత్యం పెంపొందదు; తన పాత్రల గమనంలో ఈ శక్తులను ప్రతిబింబించలేని సాహిత్యం శిల్పౌన్నత్యాన్ని పొందదు. పురాతన సమాజాన్ని సమర్థించేవారిలాగానే, యుద్ధముఖంలో, మనంకూడా, అస్పష్టమైన భావాలతో అవిశ్వాసాన్ని ప్రకటించినట్లయితే, మనం ప్రత్యేకించి సాధించగలిగిందేమిటి? గాలి దుమారంలో చెత్తా చెదారంలా వచ్చిపోయే నవలల్లాగా, మన పాత్రలు పుట్టక ముందే చావుకు తయారైతే ఎలా? పౌరాణికవీరులయుగం ముగిసింది— కాని, వీరత్వంగల మానవులకు ఎల్లప్పుడూ స్థానం వుంది. కనీసం, వీరకృత్యాలు చెయ్యడానికి సమర్థతగల స్త్రీ పురుషులకు ఇంకా స్థానం వుంది. ఇది జీవితంలో మాదిరిగానే సాహిత్యంలో కూడా వుంటుంది. పదిహేను సంవత్సరాల అజ్ఞాతవాసం, ఇంకా అంతకు పైగా కారాగారవాసం అనుభవించి వచ్చిన వీరులు, మన కార్మికవర్గానికి నాయకత్వం వహించిన వారెందరో వున్నారు. మానవజీవితాభ్యుదయం కోసం తమ జీవితాల నంకితం చేసిన వీరులూ, తమ హృదయాలను జగజ్జ్యోతులుగా వెలిగించిన నీరులూ, మన సాహిత్యంలో ప్రతిబింబించాలి. ఇలా కృషి చేయడానికి మన కొక ప్రత్యేకదృష్టి వుండాలి. ధైర్యం, ఉద్రేకం, ఓర్పు— ఇవి ఊహామాత్రమైనవే కావనీ, ధనికవాద నిరంకుశత్వం నుంచి తన్ను తాను కాపాడుకోడానికి స్వతంత్రంగా తన నిర్మాణశక్తులను పెంపొందించుకోడానికి, మానవజాతి చేస్తున్న మహత్తర ప్రయత్నంలోనే ఈ గుణాలకు స్థానం వుందనీ మనం గుర్తించాలి. బాధితులను గూర్చి వ్రాసేటప్పుడు మనం జాలి చూపినంత మాత్రాన చాలదు. ఈ బాధలూ, వ్యథలూ ఎందుకు కలుగుతున్నాయో నని ఆశ్చర్యము ప్రకటించడానికిగానీ, విధి అవిలంఘనీయమని వేదాంతం చెప్పడానికిగాని ఎంత మాత్రం అవకాశ మివ్వకూడదు. రచయిత అన్వేషణచేసి, సమగ్రంగా సహేతు

కంగా వ్రాయాలి. ఊరకే బాధలున్నాయన్నంతమాత్రాన మన బాధ్యత తీరదు. బాధల పేరిటి శుష్కమైన ఆక్రందనలూ ఆక్రోశాలూ కట్టిపెట్టాలి. విజ్ఞానంలాగానే కళకూడా మనకు ఒక ఆయుధం. వాస్తవిక వాదాన్ని ప్రతిపాదించే మనం, జీవితంలోని ఏవో కొన్ని ఘట్టాలను, ఒక లక్ష్యంలేకుండా, యధాతథంగా చిత్రించాలని కోరము. అది కేవలం ఒక ఛాయాచిత్రంలా వాక్శూన్యమై వుంటుంది. మన రచన నిండుగా సజీవంగా జీవితానికొక వ్యాఖ్యానమై, ఒక స్థిర నిర్ణయాన్ని చూపుతూ, భాసించాలి. ఆ నిర్ణయం రచయిత చేతిలోనేవుంది. రచయిత కూడా తక్కిన అందరిలాగానే బాధ్యతకలవాడు.

మానవజాతికోసం తాను జెప్పే ప్రతి అభిప్రాయానికీ రచయిత బాధ్యుడని నొక్కిచెబుతూ, సాహిత్య సమస్యలపట్ల మన సంకుచిత దృక్పథాన్ని పోగొట్టుకోవాలని కూడా మనం కోరుతున్నాం బూర్జువా సాహిత్యంలోని నకలు మార్కు రచనలను మన సిద్ధాంతాలతో ఇదివరకు అనేక పర్యాయాలు ఎదుర్కొన్నాం. ఇక్కడ మనఆశయం మంచిదైనా, ఫలితం అంతగా కన్పించలేదు. ఆ సాహిత్యంలోని భావశూన్యతనూ, బుట్టబొమ్మలాంటి ఆ పాత్రలనూ, కప్పదాటుల్లాగా సంబంధంలేని ఆ సంఘటనలనూ, బట్టబయలు చేయడం తేలికే. కాని, మనంకూడా వాళ్ళను, వాళ్ళ దృష్టినుంచే, ఎదుర్కోడానికి ప్రయత్నించడం జరిగింది. అందువల్లనే విపరీత ప్రకృతులుగల మనుష్యులను ఉదాహరిస్తూ, భావకవిత్వపు అవాస్తవికమైన పాత్రలమీద మన విమర్శనను దుర్బలపరచుకొన్నాం.

కళ బహుముఖమైనదనే విషయం విస్మరించరాదు. అది తేనెపూసిన కత్తిలాంటిది. దానికి రెండువైపులా పదునుంది! ఈ సూత్రాలను దృష్టిలో పెట్టుకొని కూడా రచనకు చక్కని రూపం ఇవ్వలేకపోతే, అది మన చేతగానితనమవుతుంది. మనం పదేపదే సిద్ధాంతాలను వల్లిస్తూ, యితర రచయితల వ్యక్తిత్వాన్ని కించపరచి, వారిని నొప్పించరాదు. ఇది పాటించకపోతే, మన పాఠకుల దృష్టి వైశాల్యాన్ని సంకుచితపరచి, సాహిత్యపు విలువల్ని గూర్చి వారి జిజ్ఞాసను కుంచించి వారిలో మానవసంబంధాలను గురించి ఒకరకం అజ్ఞానాన్నీ, అల్పభావాన్నీ కల్పించిన వారమవుతాము. అలాచేస్తే పాఠకులు సూటిగా, రాజకీయ నైతిక ప్రబోధాన్ని మాత్రమే వెతుక్కుంటూ, మన సాహిత్యంలో, ప్రజానీకాన్నీ, వారి చుట్టూవున్న వాతావరణాన్నీ, వారి అన్యోన్య సంబంధాలనూ వాస్తవికంగాను బలంగాను వర్ణించారో లేదోకూడా-గ్రహించలేని స్థితికి వస్తారు. దీనివల్ల వాస్తవికమైన పాత్రలూ, వాటి ఆలోచనలూ, నైజగుణాలు అంటే పాఠకులకు విసుగుపుట్టి, కృత్రిమమైన ఆదర్శ పాత్రలకోసం వెతుకులాట కూడా ఆరంభమవుతుంది.

నేనీ విషయాన్ని ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, పాఠకులూ రచయితలూ ఒకరినొకరు అర్థంచేసుకోనప్పుడు, రచయితలు వాస్తవిక జీవితంనుంచి దూరమైపోతున్నారని పాఠకులుగానీ, అలాగే

పాఠకులనుగూర్చి రచయితలుగానీ అనుకున్నప్పుడు, మన సాహిత్యం అభివృద్ధి చెందదు. ఒక్కొక్కప్పుడు రచయితల రచనాపద్ధతులను గూర్చిన అపోహలు అనేక సందేహాలకు దారితీస్తాయి. పాఠకుడే సహజంగా రచయిత ఒక కొత్తకొత్త విషయం చెబుతున్నాడనుకోవాలి గాని, రచయిత తనంతట తాను దండోరా వేసినట్లు ఏవిషయంచెప్పగూడదు. రచయిత యొక్క నైపుణ్యం, ఉక్తివైచిత్రి, ప్రతిభ, కథనా విధానం-ఇవన్నీ కలిసి కథలో ఉద్దేశించిన లక్ష్యంవైపు పాఠకుణ్ని తీసుకుపోవాలి. అంతేగాని' ఇది నీకు చెబుతున్నానర్రో అని, రచనకంటె ముందు రచయిత, కన్పించగూడదు. రచయిత, తన కథాసంవిధానంద్వారా, బహుముఖమైన భావవిన్యాసంతో నిండుగా సృష్టించి, పాఠకుణ్ని ఆకర్షించాలి అతని ఊహను పెంపొందించాలి. పాఠకుడు తనకు తెలిసినవాటినే రచయిత చెప్పాడు గదా అని తలపూపి లాభమేమిటి? ఏదో ఒక ఘట్టం తీసుకొని, దాన్ని సాధారణీకరించి, సిద్ధాంతీకరించినందువల్ల కల్గే ప్రయోజనమేమిటి? పాఠకుడు రచయితనుండి తెలుసుకోవాలని కోరేది' తనకు తెలియనివికాని, తెలిసినవేకావు. సోది చెప్పినట్లు రచయిత ఎన్నో విషయాలు ఊదరపెట్టి లాభమేమిటి? రచయిత కళాసృష్టి మరోప్రపంచం. అక్కడ అణువణువునా మానవత్వం ప్రతిపాత్రలో నఖశిఖపర్యంతం తొణికిసలాడుతూ వుండాలి. పాత్రలు సజీవంగాను, సచేతనం గాను ఉండాలి గాని, దిష్టి బొమ్మల్లాగా ఉండకూడదు. మానవుడు సమాజంలో మంచిగానీ, చెడుగానీ ఎంత చెయ్యగలడో, ఆ శక్తిని సాహిత్యం ప్రతిబింబించాలి మన రచయితలు చెత్తా చెదారం పోగు చేసుకొని, ఇంకా ఉపన్యాసాలు దంచుతారని భయపడకండి! రక్త మాంసాలతో కూడిన వాస్తవిక మానవజీవితాన్ని చిత్రిస్తారు.

ఇలా రచనకు జీవం పొయ్యడం సామాన్యమైన విషయం కాదు. ఒక స్పష్టమైన లక్ష్యంతో పని చేసేవారు చాలా కొద్దిమందే వుంటారు. కాని, తమ ఆశలతో-ఆవేదనలతో నడిచేవారు ఎక్కువ మంది వుంటారు. ఆకలి, ఆవేశం, ఆశ, విషయవాంఛ, కోరిక, ప్రేమ, ఆర్ద్రత, మోసం, చిరకాలపు స్మృతులు. తనలో ఉదయిస్తున్న చైతన్యం— ఇవన్నీ మానవుడి ప్రవర్తనను నిర్ణయిస్తాయి. ఈ కోరికలన్నిటి మీదా, సామాజికపరిస్థితులూ, వివిధవర్గాల స్వభావాలు, వాటి ప్రభావాన్ని విరజిమ్ముతాయి. రచయిత తన పాత్రలను ఈ అవధులన్నింటినీ గుర్తించి సృష్టించాలి. వాటి వాటి పరస్పర వైరుధ్యాలనూ, పరస్పర జగీషలనూ, సంఘర్షణలనూ ఏమాత్రం విస్మరించగూడదు. ఒక వ్యక్తిలోని సంఘర్షణే సామాజిక రంగంపై వ్యక్తమవుతూ వుంటుంది. మరోమాటల్లో చెప్పాలంటే, ఈసంఘర్షణలన్నీ విస్తృతమానవహృదయ ఫలకంమీద ప్రతిఫలిస్తూ వుంటాయి తమ కథలలో ఉద్దేశించిన లక్ష్యాన్ని చెప్పుకోవాలనే ఆదుర్దాతో, మన రచయితలు, పాత్రలకు అల్పత్వాన్ని కల్పి

చారు. స్వల్పవిషయాలమీదే కేంద్రీకరించి, రచనకు ప్రాణప్రదమైన జీవశక్తి లేకుండా చేశారు. ఇది దమ్మిడీలు కూడబెట్టుకొని, రూపాయలు పోగొట్టుకోవడం వంటిదవుతుంది. ఎన్నో రచనలు ఎంతో అమరికతో ఉన్నప్పటికీ, అవి అలికి ముగ్గుపెట్టినట్లు వుంటాయే గాని, వాటిలో జీవం లేక వేలవంగా కనిపిస్తాయి. ఏ ఉత్తమపాత్రా కూడా, త్యాగుడు, వ్యభిచారం మొదలైన వ్యామోహాలవల్ల తన జీవితాశయానికి దూరమై పోతున్నట్లుగానీ, ఏ నిరోధకపాత్రా కూడా తన ఆకర్షణ శక్తులతో జాతి భవిష్యత్తుకు కీడు తెస్తున్నట్లుగానీ, మన రచయితలు చిత్రించలేకపోయారు. ఏ రచయితకూడా వాస్తవిక జీవితానికి బదులు నీతులు చెప్పి తన ఆశయం సాధించుకోలేడు. తన్నుఅపార్థం చేసుకున్నట్లయితే ప్రజలు ఏమంటారో అనే భయం, సాహిత్యాన్ని నిర్జీవంచెయ్యడానికే, తోడ్పడుతుంది. మనం ఎవరినీ సంచలింప జేయలేని సంఘటనలనూ, పాత్రలనూ, కృత్రిమంగా కల్పించి వాస్తవిక జీవితంలో వచ్చే అనేక సంచలనాలను ఎదుర్కోలేని స్థితిలో పారకున్ని వదిలేస్తున్నాం. ఒక్కొక్కప్పుడు పాత్రల యొక్క అవధిని తెలిసో, తెలియకో నిర్ణయించుకొని, రచయితలు కథావస్తువును ఒక వలయంలో బంధిస్తున్నారు. అలాంటప్పుడు, మానవజీవితంలోని విపుల విశాల అగాధ సమస్యలను చిత్రించలేకపోతారు. ఉత్సాహోద్రేకాలకు కూడా కట్టలు వేసినట్లవుతుంది.

అమెరికాలోని రంగుభేదాలనూ, అల్పసంఖ్యాకుల బాధలనూ చిత్రిస్తూ వ్రాసిన కథలు ఎన్నో చదివాను. ఇతర పత్రికలకు కూడా ఇలాంటివే ఎన్నో వస్తువుంటాయి. మన యువరచయితల దృష్టి ఇలాంటి ప్రముఖ సామాజిక సమస్యల మీద కేంద్రీకృతం కావడం ముదావహమే. కాని- రచయితల విజ్ఞానం ఆ యా సమస్యలతో వాటికి సంబంధించిన విషయాలతో పెంపొందకపోవడం వల్ల, వారి సామాజిక విజ్ఞానం ఎక్కువ అభివృద్ధి చెందకపోవడం వల్ల, కథలన్నీ దాదాపు ఒకే రకంగా చదివినవే చదివినట్లుంటాయి.

ఒక నీగ్రో బస్ యెక్కడం- ఏ తెల్లప్రయాణీకుడో, లేక డ్రైవరో అతన్ని అగౌరవించే ఒక సంఘటనా - తర్వాత ఆ నీగ్రో హత్య-ఇదో కథ.

ఒక యూదుడు పనికి కుదరబోతూ వుంటాడు; అప్పుడే యజమానికి అతని పేరు తెలుస్తుంది- లేదా, మరొక యూదుడు అద్దెఖరారునామామీద సంతకం పెట్టినప్పుడు చూసి, యజమాని అతడు యూదుడనిగుర్తుపడతాడు. ఇక, రచయిత కాపీ తీసిన కథామూలాన్ని బట్టి, ఆ యూదుణ్ని సున్నితంగా గానీ, మొరటుగాగానీ వెళ్ళగొడతారు- ఇది మరో కథ.

ఒక చిన్న నీగ్రోనుగానీ, యూదుబాలుణ్ణిగానీ మానవత్వం లేని క్రైస్తవగూండాలు చుట్టుముట్టుతారు - ఇది ఇంకో కథ.

ఇప్పుడు సాధారణంగా వస్తున్న కథలన్నింటికీ ఇదే ముడిపదార్థం. కాని ఈ అన్ని కథల్లోను దౌర్జన్యానికి గురైనవారు అన్నివిధాలా నిర్జీవంగాను, అవాస్తవికంగాను, కన్పిస్తారు. వాళ్లు చంపకముందే చస్తారు; కొట్టేవాళ్లు లేకుండానే, దెబ్బలు తింటారు. వారి ప్రతిఘటనా శక్తులు అంతకుముందే అంతరించి నట్లుంటాయి. వాళ్లు జాలిగొలుపుతారేకాని, ఎప్పుడూ విషాదం కల్పించలేరు ఇది మన సాహిత్యంలో చాలా ప్రధానమైన సమస్యగనుక మరోపర్యాయం చర్చిస్తాను.

కాని— మనం వెంటనే సరిదిద్దుకోడానికి వీలైన మరో చిన్న లోపాన్ని గురించి చెబుతాను. ఈ కథలేగాక యుద్ధాన్ని గురించీ, నాజీజర్మనీని గురించీ ఫ్రెంచి ప్రతిఘటనోద్యమాన్ని గురించీ వ్రాసిన కథ లనేకంవచ్చాయి. అవన్నీ కూడా వార్తాపత్రికల నుంచి సంగ్రహించబడినవే అయినప్పటికీ వట్టి అభూతకల్పనలు గానే వున్నాయి. వాటిని వ్రాసిన యువ రచయితలకు ఆ కథావస్తువుతో ఏమాత్రం సంబంధంలేదు. వారు ఏది వ్రాస్తున్నారో, అది వారికి స్పష్టంగా తెలియదు. ఒక సంఘటనా ప్రాముఖ్యాన్నే గాక, ఆ విషయం యొక్క మంచి చెడ్డలను సమగ్రంగా పరిశీలించడం చాలా ముఖ్యం. ఫోటో లో చూసినట్లు— ఒక [illegible] ఓడ— పైన ఆకాశం మబ్బులు — [illegible]— [illegible] [illegible] — [illegible] ఏవో [illegible] నట్లు, జీవితం విడిపడి వుండదు. [illegible]

బొమ్మను చూసి, మనిషి అనుకోమంటే ఎవ్వరూ అనుకోరు

సంవత్సరాల తరబడి పరిశ్రమ చేస్తేనే గాని, అవగతం కాని సంభాషణా రీతుల లోతుల్లోకీ, ప్రాంతీయ స్వభావాలలోకీ, జాతీయ మనస్తత్వంలోకి తలదూర్చి, ఏమీ అనుభవం లేకుండానే, అవన్నీ కూడుకున్న రచనలు చెయ్యాలని మన రచయితలు ఉబలాటపడడం దేనికి? తాము చూడని స్థలాలను గురించీ, ఎరుగని మనుష్యులను గురించీ, ఊహించనైనా లేని భయంకర సంఘటనలను గురించీ, తమను మించిన ఆ యా సన్నివేశాల వైచిత్రిని గురించీ, వ్రాయాలనే వ్యామోహం దేనికి? దీనికి ఒక్కటే కారణం వుంది— మన యువరచయితల్లో చాలామంది మధ్యతరగతి వాతావరణంలో నుంచి వచ్చారు. వారి చుట్టూ వున్న జీవితానుభవం వారి కంత ముఖ్యంగా కన్పించడంలేదు. ఆజీవితమంటే వారికి కొంత అసహ్యం కూడా. ఈ తప్పుడు దృక్పథం కొత్తగా రచన ప్రారంభిస్తున్న రచయితకు చాలా హానికరం. ఇంకా దీన్నే అంటిపెట్టుకొని వుంటే, ఇదే అతని పతనానికిగూడా దారి తీస్తుంది. మానవ జీవితానికి సంబంధించిన ఏవిషయమైనా రచయితకు పనికిరానిది కాదు. అల్లాగే, తమతమ సంభాషణలూ, ప్రవర్తనలూ సమాజ జీవితంలో ఒదగని మనుషులూ, వర్గాలూ, సంఘటనలూ వుండనే వుండవు.

తనఅనుభవాన్ని పెంపొందించుకోడం, కొత్తకొత్త ప్రదేశాల్లో తిరగడం రచయితకు ప్రాణప్రదమైనటువంటివి. కాని,

తాను కననివీ, విననివీ, తనకున్న అనుభవాన్నే మలిచి కల్పించగూడదు. అవాస్తవికంగాను, కృత్రిమంగాను, అభూత కల్పనలతో జీవితాన్ని చిత్రించగూడదు. జీవితమంటే ఊహల్లోనుంచి ఉట్టిపడేది కాదు. జీవితమే మన భావనాశక్తికి మూలం.

కార్మికవర్గంనుంచీ, గ్రామసీమలనుంచీ అల్పసంఖ్యాక జాతులనుంచీ, వచ్చే రచయితల అభివృద్ధికోసం మనం కృషి చెయ్యాలి. వారి జీవితానుభూతి నుంచీ, భావనాశక్తినుంచీ మంచి సాహిత్యం రావచ్చు. మన 'న్యూ మాసెస్' పత్రికలో ఎన్నో ఖండకావ్యాలూ, కథలూ వ్రాసిన వారు— షాపుల్లోను, ఉక్కు ఫ్యాక్టరీల్లోను, రైల్వేలలోను, నౌకలలోను పని చేసే నీగ్రో, లిథుయేనియన్, ఐరిష్ యువ రచయితలే ననే సంగతి ఇక్కడ గమనార్హం.

—'న్యూ మాసెస్', నుంచి.

ఈ వ్యాసం ఇంకావుంది. మిగతా సగం ముందు సంచికలో వస్తుంది.

— సంపాదకులు

# సోషలిస్టు మానవత్వం

★

★ కారల్ మార్క్స్ ★

మానవుడు తన సంపూర్ణమైన వ్యక్తిత్వాన్ని, తన ఉనికికి అనువుగా అన్నివిధాలా పెంపొందించడానికీ ప్రయత్నిస్తాడు. ప్రపంచంతోటి వున్న అతని మానవ సంబంధాల్లో ప్రతి ఒక్కటీ కూడా— చూడడం, వినడం, వాసన, రుచి, అనుకోడం, ఆలోచించడం, ఆశించడం, సంకల్పించడం, నడవడి, ప్రేమ— ఒక్కమాటలో చెప్పాలంటే, అతని వ్యక్తిత్వానికి సంబంధించిన సర్వేంద్రియాలూ వాటి వాటి తక్షణ స్వరూపంలో అందరికీ అదేఅనుభూతినికలిగించే ఇంద్రియాలతో సహా, వాటి వాస్తవిక వైఖరిలో, లేదా- వాస్తవిక జగత్తును గూర్చిన వాటి వైఖరిలో, అవి వాస్తవిక జగత్తునే ప్రతిబింబిస్తాయి. మానవ వాస్తవికతను అలవరచుకోడం, వాస్తవజగత్తును గూర్చిన దాని వైఖరీ, ఇదే మానవ వాస్తవికతకు నిదర్శనం. అంటే— మానవుడి కృషి, అతని బాధా ఇందులోకే వస్తాయి. మానవ దృష్టితో చూసినప్పుడు, అతని బాధే అతనికి ఆత్మానందం కలిగిస్తుంది,

ఏ వస్తువైనా సరే, అది మనం తినేందుకుగాని, తాగేందుకుగానీ, కట్టుకునేందుకుగానీ, నివసించేటందుకుగానీ అంటే- మనకు ఉపయోగపడేటప్పుడో, లేక మనకు పెట్టుబడిగాఉన్నప్పుడో మాత్రమే ఆ వస్తువు మనదనుకునేటంత సంకుచితంగాను, మూఢంగాను ఈ వ్యక్తిగతాస్తి అనేది మనల్ని తయారు చేసింది. జీవనాధారం కోసం వీటన్నింటినీ సొంతంగా ఉంచుకొంటున్నట్లుగా ఈ వ్యక్తిగతాస్తి అనేది కనబడుతున్నప్పటికీ, అవే వ్యక్తిగతాస్తి, శ్రమశక్తి పెట్టుబడులతో కూడిన జీవితాన్ని నిర్మించడానికే తోడ్పడుతాయి. అందువల్లనే ఈ ఇంద్రియ జ్ఞాన

మంతా నశించి ఈ అన్ని భౌతిక మానసికజ్ఞానాలకు బదులుగా 'తనది' అనే జ్ఞానం మాత్రమే మిగులుతున్నది. మానవుడియొక్క ఆంతర శక్తిసంపన్నత శేకత్తాలం ఛే,ఈ సొంత ఆస్తిఅనేది పూర్తిగా నశించాలి.

కనుక, ఈ వ్యక్తిగతాస్థితత్వాన్ని రద్దు చెయ్యడమంటే- మానవుని అన్ని ఇంద్రియజ్ఞానాలకూ, అభిలాషలకూ స్వాతంత్ర్యం కలిగించడమన్నమాట. వ్యక్తిగతాస్థి రద్దయినప్పుడే మానసికంగాను, భౌతికంగాను ఈ ఇంద్రియ జ్ఞానాలూ, అభిలాషలూ నిజంగా మానవత్వం పొందుతాయి. కనుకనే ఇది స్వాతంత్ర్య మనిపించుకొంటుంది.

ఏయే శక్తులయితే వ్యక్తిగతాస్థివల్ల దూరమైపోయాయో, వాటిని తనలో ఇముడ్చుకొనే వాస్తవికమైన వుద్యమంగా యీ వ్యక్తిగతాస్థిని రద్దుచెయ్యడమనేది కలుగుతుంది.

మానవశక్తులు దూరంకావడంలో కలిగిన యీ అంతర్దృష్టి, ఆ శక్తులను ఏదైతే మనసునుంచి దూరం చేస్తున్నదో దాన్నే దూరం చెయ్యడంవల్ల, ఇది వాస్తవిక జీవితసారాన్ని ప్రతిబింబిస్తుంది, ఈరకంగా, వేరుచేయబడిన మానవత్వసిద్ధిలోని యీఅంతర్దృష్టి,వాస్తవిక ప్రపంచం నుంచి మానవుణ్ని వేరుచేస్తున్న శక్తులను నిర్మూలించే మానవజీవితవాస్తవికత్వాన్ని ప్రతిబింబించడంవల్లా. ఆ వేరుచెయ్యబడిన రూపనుంచి ఈ వాస్తవికత్వాన్ని వేరుచెయ్యడంవల్లా-దేవుణ్ణి తొలగించిననాస్తికవాదం తాత్వికమానవత్వ సిద్ధాంత మయినట్లుగాను, వ్యక్తిగతాస్థిని రద్దుచేసిన నాస్తికవాదం వాస్తవిక మానవజీవితానికీ సంపత్తుకూ విముక్తి కలిగించే సిద్ధాంతమయినట్లుగాను-అవుతుంది. ఆచరణీయమైన మానవత్వ సిద్ధాంత గమనం ఇదే! మతాన్ని రద్దుచేయడంతో ఏర్పడిన మానవత్వ సిద్ధాంతమే నాస్తికవాదం. వ్యక్తిగతాస్థిని రద్దుచేయడంతో యేర్పడిన మానవత్వ సిద్ధాంతమే కమ్యూనిజం. ఈ వ్యక్తిగతాస్థి అనే నిరోధకశక్తిని నిర్మూలం చేసినప్పుడుగాని,

నిర్మాణాత్మకమైన ప్రతిభావంతమైన మానవత్వం సిద్ధించజాలదు.

నాస్తికవాదంగానీ, కమ్యూనిజంగానీ జీవితంనుంచి తప్పుకునే సిద్ధాంతాలు కావు; అస్పష్టమైనవి కావు, కార్యరూపంలో పరిపక్వత పొందిన మానవుని చేతగాని శక్తుల వల్లగాని నిర్మించబడిన అసహజమైన అనాగరికమైన నిరాడంబరత్వానికి దారితీసే శూన్యవాదాలు కావు. మానవుడి కోసం మానవ జీవితాన్ని నిర్మించే నిజమైన ప్రప్రథమ అభ్యుదయసిద్ధాంతాలుఇవే.

(24 వ పేజీ తరువాయి)

ఓ హైరష్యన్లారా! చైతన్యవంతులైన కార్మికులారా! జాతీయాభిమానం మనకుకొత్తదా? నిజంగా కాదు. మనం మన భాషనూ, దేశాన్నీ ప్రేమిస్తున్నాం. దేశంలో నూటికి తొంభై మందిగా ఉన్న కష్టజీవులను చైతన్యవంతమైన సామ్యవాద ప్రజాస్వామిక జీవితస్థాయికి తీసుకుపోవడానికి ఎక్కువగా కృషి చేస్తున్నాం."

ప్రతి సంస్కృతిలోను రెండు విభిన్న జాతీయసంస్కృతు లుంటాయని కూడా లెనిన్ అప్పుడే 1913 లోనే చెప్పాడు:

"ప్రతి జాతి యొక్క సంస్కృతిలోను రెండు జాతీయ సంస్కృతులుంటాయి. పురిష్కేవికో గుచ్కోవ్ స్ట్రూవె స్టుల హైరష్యన్ సంస్కృతి ఉంది. చెరన్షేవిస్కీ ప్లెఖనోవ్‌లచే నిర్మించబడిన హైరష్యన్ సంస్కృతీ వుంది."

అలాగే, ప్రతి దేశంలోను ఉన్నత వర్గాల సంస్కృతి ఒకటీ, పీడిత వర్గాల సంస్కృతి మరొకటీ ఉండనే ఉంటాయి.

[ ఎ. వి. లునాచర్‌స్కీ వ్యాసాన్ని అనుసరించి ]



## నిషేధాలు, నిర్బంధాలు ఉపసంహరించుకోవాలి!

— జాతీయ ప్రభుత్వానికి ఆంధ్ర సాహితీపరుల విజ్ఞప్తి —

అఖిల భారత ప్రజానాట్య మండలివారి 'క్విట్ కాశ్మీర్,' 'నావికుల తిరుగుబాటు', 'మత కలహాలు' అనే కళాప్రదర్శనాలనూ, 'భాగో అబ్ లండన్ జావో', 'సునో సునో యే హింద్ కే రహానే వాలే' అన్న గేయాల లోని కొన్ని భాగాలనూ నిషేధిస్తూ బొంబాయి ప్రభుత్వం తీసుకున్న చర్యపట్ల మా తీవ్రమైన అసమ్మతిని ప్రకటిస్తున్నాం, మన జాతీయ కళాభ్యుదయానికి నిరోధకాలయిన ఈ నిషేధాలను తొలగించాలని - మేము జాతీయ ప్రభుత్వాన్ని కోరుతున్నాం.

బొంబాయి అభ్యుదయరచయితలు ప్రచురించబూనిన 'నయా సాహిత్య' మాసపత్రికనుంచి, మన జాతీయప్రభుత్వం, ప్రచురించక పూర్వమే రు. 1000 లు ధరావతు కోరడం పూర్తిగా తప్పనీ; అది ఏవిధంగాను సమర్థనీయం కాదనీ మేము నమ్ముతున్నాం. సామ్రాజ్యవాదుల పరిపాలనలో కూడా ఎన్నడూ జరగని ఇలాంటి సంఘటనలు మన జాతీయ ప్రభుత్వ పరిపాలనలో జరగడం సహించరానిది. కనుక, ఇలాంటి చర్యలను మేము తీవ్రంగా నిరసిస్తున్నాం.

తమ నిరంతర కృషితోను అఖండ త్యాగాలతోను మన స్వాతంత్ర్యోద్యమాన్నీ జాతీయ సంస్కృతినీ నిర్మించడంలో ఉత్తమ పాత్ర వహించిన మన జాతీయనాయకులు, బొంబాయి ప్రభుత్వం అనాలోచితంగా తీసుకున్న మనసంస్కృతీ సాహిత్యాల అభ్యుదయాన్ని అరికట్టే ఈచర్యలను, ఖండిస్తారని ఆశిస్తున్నాం.

మన జాతీయప్రభుత్వం ఈ నిషేధాలనూ నిర్బంధాలనూ వెంటనే అంతమొందించడానికి అవసరమైన చర్యలు తీసుకోవా

లని, మేము హృదయపూర్వక మైన విశ్వాసంతో, అర్థిస్తున్నాం.

ఇట్లు

విశ్వనాథ సత్యనారాయణ
ముద్దుకృష్ణ
మల్లవరపు విశ్వేశ్వరరావు
పువ్వాడ శేషగిరిరావు
దేవులపల్లి కృష్ణశాస్త్రి
శ్రీరంగం నారాయణబాబు
ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి
శ్రీరంగం శ్రీనివాసరావు
పురిపండా అప్పలస్వామి
'ఆరుద్ర'
షేక్ నాజర్
డాక్టర్ గిడుగు సీతాపతి
న్యాపతి రాఘవరావు
నార్ల వెంకటేశ్వరరావు
చల్లా జగన్నాథం
శ్రీనివాస శిరోమణి
ఎస్. వి. సుబ్రహ్మణ్యశర్మ
చెరుకుపల్లి జమదగ్నిశర్మ
పి. శ్రీరాములు
జి. రామచంద్రరావు
ఎం. సత్యనారాయణశర్మ
ముద్దా విశ్వనాథం
ఎం. శివరామకృష్ణయ్య
ఆంధ్ర శేషగిరిరావు
వఝ్ఝ కాళిదాసు
ఎ. రామకృష్ణ
ఎస్. బ్రహ్మ
జె. వి. సుబ్బయ్యశాస్త్రి
జె. వి. రాధాకృష్ణయ్య
అన్నే అంజయ్య
వట్టికొండ రంగయ్య
డాక్టర్ నేలటూరి వెంకటరమణయ్య
మల్లంపల్లి సోమశేఖరశర్మ
కె. సుబ్రహ్మణ్యం
ఏడిద కామేశ్వరరావు
బొందలపాటి శివరామకృష్ణ
కొమట్రాజు వినాయకరావు
ప్రయాగ కోదండరామశాస్త్రి
ఎం. సూరి
ఎల్. వి. ఎస్. ప్రసాద్
సి. హెచ్. నారాయణరావు
సముద్రాల రాఘవాచార్య
వి. టి. ఎల్. నరసింహారావు
వి. దుర్గాప్రసాదరావు
వి. ప్రకాశ్
ఊన్నవ లక్ష్మీనారాయణ
జంధ్యాల పాపయ్యశాస్త్రి
దేశిరాజు కృష్ణశర్మ
ఏల్చూరి సుబ్రహ్మణ్యం
కుందుర్తి ఆంజనేయులు
ప్రతాప రామసుబ్బయ్య
ధనకుధరం వెంకటాచార్య
చెరుకుపల్లి నరసింహశాస్త్రి
'అజంతా'
అనిశెట్టి సుబ్బారావు
నాగభైరవ శివరామకృష్ణయ్య
చదలవాడ పిచ్చయ్య

ఆంధ్ర అభ్యుదయ
రచయితల సంఘం

# సాహిత్య మీమాంస - [18 వ పేజీ తరువాయి]

★

## (ప్రజాశక్తి విమర్శ)

అభ్యుదయలో శ్రీ ప్రయాగవారి విమర్శనకు 6 పేజీలు ఖర్చుపెట్టారు. ఇలాంటి దీర్ఘమైన విమర్శన వ్రాసేటప్పుడు ముందుగా నాటకంలోని ఇతివృత్తం యిచ్చి తరువాత దానిలోని లోటుపాటులను చూపడం న్యాయం కాని "ప్రయాగవారికి" అదేమి పట్టలేదు. మొదటి పేరాలోనే "పాఠకులను ప్రేక్షకులనూ" చాటుచేసికొని బాధపడసాగారు. ఆ నెప్పులలో వారికొక "వికృత స్వరూపం" కనిపించనారంభించింది. మనోనిబ్బరం తెచ్చుకోడానికి మాక్సింగోర్కీ పలుకుల సాయం కావలసి వచ్చింది. "సాహిత్య ప్రయోజనం ఉత్తేజం కలిగించడంగాని, జోల పాటపాడి లాలించడం కాదు" అని వల్లించారు.

ఇలా తీర్పుచెప్పి వేశాక, విమర్శకులు ఆ తీర్పను బలపరచే సాక్ష్యాలకోసం వెదకడం ప్రారంభించారు. సరియైన సాక్ష్యం లేకపోతే తప్పుడుసాక్ష్యం సృష్టించే కోర్టుపక్షీలాగా పుస్తకంలో లేని విషయాలను వున్నట్లుగాను, ఉన్నవి లేనట్లుగానూ, రుజువుచేయడానికి ప్రయత్నించారు. కథావస్తువును యివ్వడంలోగాని, దానికి భాష్యం చెప్పడంలోగాని విమర్శకుడు రంగుల అద్దాలతో చూచిన కేవలం 'వికృతస్వరూపం కన్పించింది. తత్ఫలితంగా వారికి కలిగిన కలవరపాటే విమర్శన రూపంగా అభ్యుదయలో అచ్చయింది.

'మాభూమి' నాటకంలో తెలంగాణాలోని సోదర ప్రజలు దేశముఖుల దౌర్జన్యాలకు, లంచగొండి వుద్యోగుల హింసాకాండకు నైజాం నవాబు దుష్పరిపాలనకు ఎలా గురిఅవుతున్నారో చిత్రించడానికి రచయితలు ప్రయత్నించారు. నాటకం చదివిన వేలకొలది పాఠకులు, ప్రజానాట్యమండలి ప్రదర్శించగా చూస్తున్న లక్షల ప్రేక్షకులూ ఉత్తేజం పొందుతున్నారు. నిద్రాణమైవున్న ఆంధ్ర జాతీయతను అది మేల్కొల్పుతోంది. తెలంగాణా సోదరులకు అండగా నిలబడి మన కర్తవ్యాన్ని నెరవేర్చుదామనే ఆవేశం కలిగించుతోంది. కాని దురదృష్టవశాత్తు శ్రీ ప్రయాగవారిని అది జోలపాట పాడి నిద్రపుచ్చిందట అదేమి ఖర్మమో ? అందుచేత శ్రీవారికి ప్రయోజనరహితమయి "మాభూమి" నాటకం ఈ చేతగానితనాన్నే ప్రదర్శించుకుందట.

దేశముఖుతో పోరాడి వీరమరణం చెందిన 'బందగీ' ఉపనుతో నాటకం ప్రారంభమవుతుంది. ఆ వీరుని సమాధి యెదుట హిందూ-ముస్లిం రైతులు, స్త్రీ-పురుషులు తమ కష్టాలను చెప్పుకుంటారు. సంఘం పెట్టుకొని దేశముఖు దుండగాలను ఎదిరించాలని ఉద్రేకులైన యువకులు దీక్షబూనుతారు. దాదా వంటి వృద్ధుడు, అమాయకుడు, భయస్థుడైన ఎల్లమంద, సాధారణ గృహిణి సీతమ్మ క్రమంగా ఎలా, పరివర్తన చెందుతారో నాటకంలో చిత్రించ బడింది. దేశముఖు పట్వారీల

కుట్రలు, దురంతాలు చూపింపబడ్డాయి. స్త్రీలపై దేశముఖు ఏజంట్లు అఘాయిత్యాలు, ప్రజలచేత వెట్టి చేయించుకోడం, భూములు కాజేయడం, లెవీ వసూళ్ల పేరుతో చేసే దౌర్జన్యాలు నిరూపింపబడ్డాయి. కుల-మతాల పేరుతో ప్రజలలో చీలికలు తేవడానికి చేసే దేశముఖు ప్రయత్నాలను విఫలం చేసి ప్రజలు ఐకమత్యముతో ఎదుర్కోడం చిత్రించబడింది. జమీందారీ పోలీసుల దాడి నెదుర్కొని దాదా సీతమ్మలు బలి అవుతారు కాని విజయం ప్రజలదే. తమభూములను ప్రజలు స్వాధీనం చేసుకుంటారు.

అలాంటి నాటకంపైన శ్రీ ప్రయాగవారు 'ఇందులో ప్రతి పాత్రా, బజారు మనుష్యుల్లాగా ఎప్పుడు పడితే అప్పుడూ, ఎక్కడ పడితే అక్కడ స్త్రీపురుష వివక్షత కూడా లేకుండా బూతులు మాట్లాడుతారు. ఉదాహరణలు అనవసరం. ఈ విధంగా ప్రజా జీవితాన్ని అవాస్తవికంగాను, అనుచితంగాను, ఊహాజనితంగాను అసభ్యంగాను చిత్రించడం ప్రమాదకరం. ఇది ఏ విధంగాను అభ్యుదయ రచన అనిపించుకోదు' అంటూ జడ్జిమెంటు చెప్పివేశారు.

పై మాటలలోనే శ్రీ ప్రయాగవారు ప్రజలకు ఎంతదూరంగా నున్నారో బోధపడుతుంది "నలుగురితో పాటు నారాయణా" అనేవారిని ప్రజాసామాన్యాన్ని 'బజారు మనుష్యులని ఏవగించుకునేవాడు అభ్యుదయ రచయిత ఎన్నటికీ కాజాలడు ఎన్ని బూతుపదాలు వాడినా, ఎంత తీవ్ర పదజాలం ప్రయోగించినా అతను ప్రజా విరోధి అవుతాడు. శ్రీ ప్రయాగవారు తమ విమర్శనలో అనుసరించిన పంథా కూడ పూర్తిగా ప్రజావిరోధులు అనుసరించే టెక్నిక్‌గానే వుంది. ఉదాహరణకు చూడండి.

కాంగ్రెసును పటేలును రచయితలు ఆక్షేపించారనీ జాతీయోద్యమ ప్రభావాన్ని చిత్రించలేదనీ చెపితే కాంగ్రెసు వాదులంతా తనపక్షం వహించుతారనీ శ్రీ ప్రయాగవారు ఆశించారు. ఇత్తిహాదుల్ ముసిల్మీన్ మత ప్రచారాన్ని బట్టబయలు చేయలేదని తిడితే హిందువులకు నాటకంపై కోపంవస్తుందనుకున్నారు శ్రీ నారాయణరెడ్డి యెల్లారెడ్డిగార్లను, ఆంధ్రమహాసభ కృషిని వాస్తవికంగా చిత్రించలేదంటే తెలంగాణా ప్రజలందరకు ఏవగింపు కలుగుతుందని ఊహించారు. ఈ విధంగా మాభూమి నాటకానికి-రచయితలకు వ్యతిరేకులైనవారంతా తన విమర్శనను వేనోళ్ళ కొనియాడతారని శ్రీ ప్రయాగవారు పగటికలలు కనివుండవచ్చు.

కాని వాస్తవం ఏమిటి? నాటకం చదివిన పాఠకులు, ప్రదర్శనాలు చూచిన ప్రేక్షకులు శ్రీ ప్రయాగవారి విమర్శనను-కాదు! రంధ్రాన్వేషణను-వేనోళ్ళ నిరసించుతున్నారు కాంగ్రెసు దేశభక్తులు ఆంధ్రమహాసభవారు, తెలంగాణా యోధులు 'మాభూమి' రచయితలను అభినందించుతున్నారు.

ఇప్పటికైనా వక్రదృష్టి విడనాడి చుప్పనాతితనం-ఉక్రోషం వదలి, వెనుదిరిగి చూసుకుంటే శ్రీ ప్రయాగవారు

సత్యాన్ని గుర్తించుతారు! తన తప్పును అభ్యుదయ పాఠకులకు, క్షమాపణ చెప్పుకుంటారు. లేనిచో మాక్సింగోర్కీ మాటలను వల్లించడంగాని, అర్థంచేసుకోకుండా జీర్ణంకాని పదజాల ప్రయోగంగాని 'ప్రయాగ' వారిని ప్రజా వ్యతిరేకుల వూబిలోనుంచి రక్షించదు.

అసలు శ్రీ ప్రయాగవారు వ్రాసింది సాహిత్య విమర్శ అనిపించుకోదు అందుచేత ఆయన వెదకిన నెరసులన్నిటికీ సమాధానం ఇవ్వనక్కరలేదు. స్థలం దుర్లభం. నాటకం చదివి, చూసి ఉత్తేజం పొందుతున్న ప్రజలే శ్రీ ప్రయాగకు సరియైన సమాధానం యిస్తున్నారు—ఇస్తారు.

## 'మా భూమి'

నిజాము ప్రజల పోరాటాన్ని చిత్రించే నాటిక. ఈ నాటిక సుంకర—వాసిరెడ్డి రచించి ఆంధ్రప్రజానీకానికి అందించారు. కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలివారు పలుచోట్ల ప్రదర్శించారు ఈ నాటకం ప్రజామన్ననలకు పాత్రమైనది. ఈ నాటకం మీద మా అభిప్రాయం క్రిందటిసంచికలో ప్రకటించాం.

ఈ నాటకాన్ని 'అభ్యుదయ' పత్రికలో విద్వాన్ ప్రయాగగారు పచ్చి రకమైన భావకవిత్వం క్రింద జమకట్టారు. ఈ నాటకం ప్రయాగవారి దృష్టిలో నిరుపయోగమై పోయింది 'నవయుగ'లో రావుగారు ప్రయాగవారి విమర్శకు చక్కగా సమాధానం చెప్పారు.

ప్రయాగవారికి పల్లెటూరి జీవితాలు, పల్లె నాయకుల పట్టుదలలు, పల్లె ప్రజల భావౌన్నత్యం, పల్లె పడుచుల ప్రభావం, పల్లెటూరు పెత్తనదార్ల రాజకీయాలు, పల్లె ప్రజ కట్టుబాట్లు తెలియవు. పట్టణాలలో వుండేవారికి పల్లెటూళ్ళ సమస్యలు అర్థం కావు. అందువలన ప్రయాగవారు పట్టణవాసి గాబట్టి- వారు వాస్తవిక దృష్టితో ఈ నాటకాన్ని తిలకించలేక పోయారు. వారికి అర్థం కాక తెలియని విషయాలను తెలిసినట్లు వ్రాయ బూనుటలో వచ్చిన తొందరపాటు?- ఇందుకు ప్రయాగవారిని తప్పుబట్ట నక్కరలేదు.

ఈ నాటకంతో నిజాం రాజకీయాల్ని, నేటి సమస్యల్ని, రచయితలు అన్నిరంగాలలో పాత్రలచేత ఆయా సందర్భాలను పురస్కరించుకొని చక్కగా చెప్పించారు. వ్యావహారిక దృష్టితోను, నేటి దుర్భర ప్రజాపీడితదృష్టితోను దిలకిస్తే అత్యుత్తమ నాటకమని చెప్పక తప్పదు.

(గ్రామోద్యోగి) సంపాదకుడు—



# 'ప్రయాగ' విమర్శపై ప్రతివిమర్శకు ప్రతివిమర్శ

★

శ్రీ 'ప్రమథేశ్'

ఆంధ్రదేశంలో అభ్యుదయ సాహితీ మహోద్యమ నిర్మాతలలో ఒకరైన శ్రీ ప్రయాగ కోదండరామశాస్త్రిగారు 'అభ్యుదయ' మాసపత్రికలో 'మాభూమి' అన్న నాటకంపై ఒకవిమర్శన వ్రాశారు ఆయన ఆ 'విమర్శన' అనే వజ్రాయుధాన్ని ఝుళిపించడమే ఆలస్యంగా సాహితీ జగత్తులో గాలివాన ప్రారంభించింది. ఈ గాలివాన కొట్టిస్తున్న జలధరాల్లో నేనుకూడా ఒక జలధరాన్ని అవుదామని ఆసక్తితో ఈచిన్న వ్యాసాన్ని రచిస్తున్నాను

శాస్త్రిగారి విమర్శపై అనేక ప్రతి విమర్శనలు బయల్దేరినై కొన్ని పత్రికాముఖంగా ప్రచురితమైనాయి. కొన్ని మావంటివారి ముందు ముఖాముఖిగా ప్రచురితమైనాయి. శాస్త్రిగారు వ్యక్తిగత క్రోధోన్మాదంవల్ల యిలా వ్రాశారని కొందరు నాతో అన్నారు. కాని నేను అలా అన్నవారికి జవాబు చెప్పలేదు. ఎందుకంటే అలా అన్నవారు అన్నది విమర్శ కాదు. పైగా వారు శాస్త్రిగారి వ్యక్తిపరిశీలనకు పూనుకున్నారు. వ్యక్తిగతాన్తర విషయపరిశీలనచేసే శాస్త్రజ్ఞుణ్ణి నేను కాకపోవడం ఫలితంగా వారు సెలవిచ్చిన అవ్యక్త విమర్శలకు సమాధానం ఇచ్చే యోగ్యత నాకు లేకపోయింది.

ఈ వ్యాసంలో పత్రికాముఖంగా వారి విమర్శన ఖండిస్తూ ప్రచురితమైన ప్రతి విమర్శలకు మాత్రమే నేను సమాధానమిస్తున్నాను

'నవయుగ' పత్రికలో ఒక విమర్శన ప్రచురితమైంది. 'ప్రజాశక్తి' పత్రికలో ఒక విమర్శన ప్రచురితమైంది. ఈ విమర్శనలను ఖండించడానికి పూర్వం నేను ఒక విషయాన్ని చెబుతున్నాను. విమర్శించడానికీ ప్రతివిమర్శన చెయ్యడానికి ప్రతి మానవునికీ హక్కున్నది.

శ్రీ ప్రయాగ కోదండరామ శాస్త్రి గారి విమర్శ ఎంత శిష్టంగా సభ్యంగా సాహితీ సిద్ధాంత సంపన్నంగా ఉన్నత సంస్కృతీ విలసితంగా ఉన్నదో ఈగుణాలన్నిటికీ పూర్తిగా ఎదురైన గుణాలతో పైరెండు పత్రికలలోని విమర్శలూ నిలయాలై ఉన్నవి ఒక శిష్టమైన విమర్శకుణ్ని శిష్టమైన పద్ధతిలోనే ఎదురుకోవాలన్న ప్రాథమిక మానవసభ్యతను ఈ ఎదురు విమర్శలు వ్రాసినవారు గమనించలేకపోయారు. 'ప్రయాగ'కు ఏడుక్రోషం అనే 'దుర్గుణాన్ని' అంటుగట్టారో. ...

దుర్గుణానికి తామే సమ్మిళనబంటులై విమర్శ సాగించారు ప్రయాగ విమర్శను 'అవాకులు—చెవాకులు' అని అవహేళన చేసి విమర్శించామని తృప్తిపడ్డారు. ప్రయాగను 'కోర్టు పక్షి' అని విమర్శించేశాం ఇంకేం అనుకున్నారు. 'శ్రీవారు', 'అభ్యుదయ విద్వాంసుడు'— ఇలాంటి అవహేళనా పూర్వక పదప్రయోగాలు చేసి ప్రతాపం వెలిబుచ్చామనుకున్నారు. ప్రయాగకు 'చుప్పనాతితనం, ఉక్రోషం' ఉన్నదని, ఉండకూడదని ఉపదేశించి— తామే వాటిని ఆశ్రయించుకున్నారు. ఇలా ఒక point కూడా లేకుండా క్రిందికోర్టులో చెట్టుక్రింద ప్లీడర్లలా వాదించి, శిష్టులకు హృదయ కఠోరమైన పదజాలప్రయోగం చేసి సంస్కృతీరాహిత్యపు కడపటి లోతును చూచారు.

ఒకచోట విమర్శనలో ఇలా ఉన్నది. 'నలుగురితోపాటు నారాయణా' అనే వారిని, ప్రజాసామాన్యాన్ని- బజారుమనుషులని ఏవగించుకునేవాడు అభ్యుదయ రచయిత కాజాలడు' అని. శాస్త్రిగారు ప్రజాసామాన్యాన్ని ఏవగించుకోలేదు. బజారు మనుషుల్లాగా మాట్లాడే ఫక్కీని ఏవగించుకున్నారు. ఏవగించుకోకూడద ప్రజావిరోధుల టెక్నిక్ అవలంబించా మర్గాక విమర్శ. ఈ స్థానంలో మా విమర్శకులు విమర్శదాటి 'అపూర్వ భ కవిత్వాన్ని' రాశారు. చివరకు ప్రజ సమాధానం చెబుతారని తమ బాధ్యత విడాకులిచ్చారు. ప్రజలు ఏది గొప్పదం అది గొప్పదనడం మాత్రమే అభ్యుద లక్షణం కాదు.

కోటానుకోట్ల ప్రజలు 'మా భూ ఎడలనే కాదు, తిరుమల తిరుపతిస్వా ఎడలకూడా అనురక్తులైనారు. కాబట్టి 'డాగ్మ'ను మనం కూడా 'అభ్యుదయ అందామా? ఒక విషయాన్ని శాస్త్రజ్ఞ విలువ కడుతుంది కాని— ఒక మేలో నని ప్రజ కాదు. ప్రజ ఏదంటే మనం ఆ ప్రతిశబ్దిస్తే ఇక మనం ఎందుకు ప్రజ కోసం వ్రాయడం? వారే వ్రాసుక టారు. మనం ప్రజతో ఉండాలి. ప్రజ ముందుండాలి. ఈ రెంటి సమ్మేళన అభ దయం. శాస్త్రిగారి విమర్శపై ఇంతవర వచ్చిన ప్రతివిమర్శలు ఏవీ విమర్శలు-కావ ఏ మహాభాగుడైనా సక్రమ ప్రతివిమ రాస్తే ఆనందంతో ఆహ్వానిస్తాను.



# మహా సంకల్పం

★
★★

శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు

ఇది నా స్వాతంత్ర్యదిన
మహా సంకల్పం,
విధిగా వికసించే
చరిత్రకొక కృతజ్ఞత,
ప్రజలకు నివాళి,
ప్రభవించిన నూతన భారత
పతాక కభివాదం,
భవిష్య దుజ్జ్వల
ధర్మయుగానికి ఆహ్వానం,
సరిహద్దు లెరుంగని
సకల జగజ్జనులారా
ఇదిగో నా స్వాతంత్ర్యస్వప్నం!

ఏ స్వాతంత్ర్యనిమిత్తం ఎవరెవరెవరో దేశసేవా
భాస్వంతుక బాలవృద్ధుక పతితు లధికు లప్రాజ్ఞులుత్ప్రజ్ఞులంతా
అస్వాశల వీడి లాఠీహతులయి ఉరికొయ్యల్ కవుగింట చేర్చా
రా స్వాతంత్ర్యం లభించిందనివిని హృదయం హ్లాదసంపుష్టమైతే

నవోదిత స్వాధీనతానంది తోత్ఫుల్లమైన
నగరం జెండాల పంటలతో నవ్వుతూ పాడుతూఉంటే
ఉత్సాహ ప్రవాహంలో నేనూ ఒక బిందువునై
స్వాతంత్ర్య వాయువులు పీలుస్తూ సాగిపోయా

ఆ సమయంలో అందరి మనస్సు
లావరించె నొక వ్యక్తి
అందరిలోనూ ఆ సమయంలో
ఆవహించె నొక శక్తి
అంతట్లోకే అకస్మాత్తుగా
జన సందోహం కరగి
ఒకే వ్యక్తిగా రూపుధరిస్తే
ఇదేం చిత్రమని చూశాను :

ఒక పెద్ద కాంస్య విగ్రహా
నికి ప్రాణం వచ్చినట్లుగా,
ఒక మేఘం గగన పథం దిగి
మానవుడై, నిలచి నట్లుగా,
ఒక మహా వట వృక్షం
హఠాత్తుగా నడిచినట్లుగా,
ఒకేఒక్క మానవమూర్తి
నా కళ్ళముందు కనిపించాడు
ఏం చేతో అతని ముఖం మీాద
ఎప్పుడూ ఉండే పసిపాప నవ్వు లేదు!

ఆ మానవాననంలో
ఏదో కించిద్విషాదం, కించిన్నిరాశ
కొంచెం విరాగం, కించి దసంతృప్తి.
ఆ మానవ వదనం అందరికీ పరిచితమే;
అతడే నువ్వూ నేనూ, అంతమందీ వెరసి.

స్వతంత్ర భరతవర్షా వాస్తవ్యుడా మానవుడు
అర్ధనగ్నంగా ఆకాశాన్నే కప్పుకొని

నిండని కడుపుతో మండుతూన్న కళ్లతో
ఎలా ఎంతకాలం ఇంకా నిలబడతాడా ప్రాణి?

అతణ్ణి జాగ్రత్తగా చూడండి
స్వతంత్ర భారత పౌరుడు,
అతని బాధ్యత వహిస్తామని
అందరూ హామీ ఇవ్వండి,
అతని యోగ క్షేమాలకు
అంతా పూచీ పడండి,
అతికించండి మళ్లీ
అతని ముఖానికి నవ్వు!

స్వాతంత్ర్యం ఒక చాలా సున్నితమైన పువ్వు,
చాలా వాడైన కత్తి, విలువైన వజ్రం
స్వాతంత్ర్యం తెచ్చే వెన్నెన్నో బాధ్యతలు
సామర్థ్యంతో నిర్వహిస్తామని
సంకల్పం చెప్పుకుందాం!

భగవంతుని ప్రార్థించిందికి
బహుశా ఇది సమయం కాదు,
పాతవి గుండాళించిందికి
బహుశా ఇది సమయం కాదు;
ఇది మన కొక దీక్షాసమయం
ఇది మనకి పరీక్షాసమయం
ఆవేశం ప్రకటించిందికి
అసలే ఇది తరుణం కాదు—

రా! నేస్తం, పోదాం! చూదాం
మువ్వన్నెల జెండా పండుగ;

రా! నేస్తం, లేదాం! చూదాం!
మన భారతజన సౌభాగ్యం;

అటు చూడు సముద్రం, నేస్తం,
హర్షానికి పర్యాయపదం;
ఇటు చూడు విహాయసనేత్రం
దుఃఖానికి అధ్యాహారం!
ఈ రెండిటి మధ్య నిలిస్తే
నీ లోపల లోలోపలికే
ఆలాపన లాలోకిస్తే
వినపడదా ఒక సంగీతం,
విడివడదా ఒక సందేశం!

ఇదీ నా స్వాతంత్ర్యదిన—
మహా సంకల్పం,
ఇది నా ప్రజలకు నివాళి
స్వతంత్ర భారత పతాకాని
కిది నా అభివాదం,
భవిష్య దుజ్జ్వల
భర్మ్యయుగానికి ఆహ్వానం,
సరిహద్దులు లేని
సకల ప్రజలారా!
మనుష్యుడే నా సంగీతం,
మానవుడే నా సందేశం!

[ఆలిండియా రేడియోవారికి కృతజ్ఞతతో—

# రాష్ట్ర కార్యవర్గ సభ్యులకు, స్థానిక సంఘాలకు
# కార్యదర్శి విజ్ఞప్తి

మన 'అభ్యుదయ' మాస పత్రికగా వచ్చి ఈ నెలతో ఏడాది పూర్తవుతుంది. ఈ పత్రికను నడపడంలో అన్ని విధాలా సహకారం చేసే బాధ్యత కార్యవర్గసభ్యులందరికీ, అన్ని స్థానిక సంఘాలకూ ఉంది. పత్రికా నిర్వహణంలో ఇంతవరకూ మాకు ఎవరి నుంచీ ఏ విధమైన సూచనలూ రాలేదు. పత్రిక నడపడంలో అందరి సహకారం లేకుండా, బాధ్యత నిర్వహించడం కార్యాలయంలో పనిచేస్తున్న ఒకరిద్దరి శక్తికి మించిన పని అవుతుంది ప్రతి నెలా పత్రిక పేజీ లెలా నింపుదామా — అన్న అవస్థే పడవలసివస్తున్నది. అనువాద సాహిత్యంతో పత్రిక నింపవలసి వస్తున్నది. కొన్ని అనువాదాలు మన సాహిత్యాభ్యుదయానికి తప్పనిసరి అవుతాయి. అయితే, అన్నీ అనువాదాలతోనే నింపితే, మన స్వీయ జీవితాన్ని వ్యక్తం చేసే స్వతంత్ర రచనాశక్తి పెరగదు.

రాష్ట్రకార్యవర్గ సభ్యులూ, స్థానిక సంఘాలూ బాధ్యత పంచుకొంటేనే, స్వతంత్ర రచనా [illegible] పెంపొందించగలం. మన సాంఘిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థలను మార్చడం కోసం నిరంతరం జరుగుతున్న జీవిత పోరాటాన్ని చిత్రించగలం. అలాంటి సాహిత్యమే సాంఘిక వ్యవస్థలో వ్యక్తి నిర్వహించవలసిన బాధ్యతలకు కావలసిన మనస్థైర్యాన్ని ఇస్తుంది.

సాహిత్య విమర్శన రచయితలసాహిత్య జిజ్ఞాసనూ, ఆలోచనా శక్తినీ పెంచడానికీ, రచనా శిల్పపు లోతుపాతులను అవగతం చేసుకోడానికీ తోడ్పడుతుంది.

మన సంఘం ఈ బాధ్యతలను నిర్వహిస్తేనే మన 'అభ్యుదయ' సాహిత్యాభ్యుదయానికి మార్గదర్శకంగా పనిచేయ గలుగుతుంది.

ఈ బాధ్యత నిర్వహించడంలో అన్ని స్థానిక సంఘాలూ, అందరు కార్యవర్గ సభ్యులూ శ్రద్ధ వహించాలనీ, తమ తమ ప్రాంతాలలోని రచయితల ఉత్తమ రచనలను సేకరించి 'అభ్యుదయ'కు తోడ్పడాలనీ కోరుతున్నాను.

ఇట్లు

బెజవాడ
10—9—47

చదలవాడ పిచ్చయ్య,
కార్యదర్శి
ఆంధ్ర అభ్యుదయరచయితల సంఘం.



Editor, Printer & Publisher C Pithayya
Secretary, Andhra Progressive Writers' Association, Governorpet,
Printed at Abhyudaya Press, Bezwada. Q H. No. K. 3. A.

# కుష్ఠు-బొల్లి

మొదలగు సకల, మేహములకు, ఇతర చర్మవ్యాధు లకును, సెగ, సవాయి మొదలగు వ్యాధులకు

## గ్యారంటీ చికిత్స!

బ్రాంచ్:

బెజవాడ
గాంధీనగరం

★

వాల్తేరు
ఆర్ యస్. పోష్టు

★

ఆఫీసులు:

సికింద్రాబాద్
3560 కింగ్సువే

★

కటక్
బక్సీబజారు

### "మునిగిపోదామనుకున్నాడు"

హెచ్. బావాజీ దేహాలో,

కెల్లంబల్లి, కెల్లంబల్లి
చామరాజనగర్ పోస్టు; మైసూరు. 10-1-1945

అయ్యా!

క్రిందటిసారి మీవద్ద తెప్పించిన అత్యద్భుతకుష్ఠు రోగనివారిణి మొదటిసారిగా కగ్గిల్లావాడాడు. ఆయన అమితానందంతో నాదగ్గరకు వచ్చి, తన శరీరంమీద మచ్చలను నాకు చూపించాడు. మీమందు ఒక్కసారి వాడేవరకే మచ్చలు దాదాపునయమైపోవటం నాకాశ్చర్యం కలిగింది. ఇప్పుడు ఆయన మనిషి మొత్తం పూర్తిగా మారిపోయినట్లున్నాడు. ఆయన మీమందు పుచ్చుకోకముందు తన వ్యాధి నయం కాదనే నిరాశ వల్ల నీటిలోపడి చనిపోదామనుకున్నాడు. ఇప్పుడటు వంటిభావాలు ఏమీలేవు. ఆయన కృతజ్ఞతాభివందనాలను నేను మీకు తెలియజేస్తున్నాను. మళ్ళీ మీ మందును వి. పి. ద్వారా పంపగోరుతున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
(సం) హెచ్. బావాజీ దేహాలో.

పెద్ద తెలుగు క్యాటలాగు, 19 భాషల్లో క్యాటలాగులు
యోగ్యతాపత్రికములు:— ఉచితం!

## రెడ్డి & కో

(రిజిష్టర్డ్)

H O గోపాలపురం — వయా తణుకు, తూర్పు గోదావరి